శ్రీరస్తు

# శంఖధర్మశాస్త్రము.

పండితుల, సాహాయ్యమువలన,

మ-రా-రా-శ్రీ, దీ,హాన రేబిల్

పళ్లై, చెంచలరావుపంతులు-సీ-ఐ-ఇ- గారిచే

ప్రతిపదార్థ సహితముగవ్రాయఁబడి

బ్రహ్మశ్రీ, వావిళ్ల, రామస్వామిశాస్త్రిలవారిచే

పరిష్కరింపఁబడి

ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రచురము చేయబడియె.

౧౮౭౮ సం॥



శ్రీః

## శంఖసంహితాప్రారంభః.

మూ॥ స్వయంభువే నమస్కృత్య సృష్టిసంహారకారిణే । చాతు
ర్వర్ణ్యహితార్థాయ శంఖశ్శాస్త్ర మకల్పయత్. ౧

టీ॥ శంఖః=శంఖుఁడు, సృష్టిసంహారకారిణే = సృష్టిసంహారములు చేయువాఁడైన, స్వయంభువే= పరమాత్మకొరకు, నమస్కృత్య=నమస్కరించి, చాతుర్వర్ణ్యహితార్థాయ= నాలుగువర్ణముల హితవుకొరకు, శాస్త్రం = ధర్మశాస్త్రమును, అకల్పయత్ = చేసెను.

మూ॥ యజనం యాజనం దానం తథైవాధ్యాపనక్రియామ్ । ప్రతి
గ్రహంచాధ్యయనం విప్రః కర్మాణి కారయేత్. ౨

టీ॥ విప్రః- బ్రాహ్మణుఁడు, యజనం= యజ్ఞముచేయుటను, యాజనం = యజ్ఞముచేయించుటను, దానం = దానమునిచ్చుటను, తథాఏవ = అటువలెనే, అధ్యాపనక్రియాం = అధ్యయనముచేయించుటను, అధ్యయనం= అధ్యయనము చేయుటను, ప్రతిగ్రహంచ = దానముతీసికొనుటను, కర్మాణి= (ఈ) కార్యములను, కారయేత్=చేయవలయును.

మూ॥ దానమధ్యయనంచైవ యజనంచ యథావిధి । క్షత్రియస్య
చ వైశ్యస్య కర్మేదం పరికీర్తితమ్. ౩

టీ॥ యథావిధి = శాస్త్రముచెప్పిన, దానం= దానమిచ్చుట, అధ్యయనంచఏవ= వేదపఠనము, యజనంచ=యాగముచేయుట, ఇదం= ఇది, క్షత్రియస్యచ = క్షత్రియునికి, వైశ్యస్య=వైశ్యునికి, కర్మ= స్వకర్మముగా, పరికీర్తితం = చెప్పబడినది.

మూ॥ క్షత్రియస్య విశేషేణ ప్రజానాం పరిపాలనమ్ । కృషిగోర
క్షవాణిజ్యం విశశ్చ పరికీర్తితమ్. ౪

టీ॥ క్షత్రియస్య=క్షత్రియునికి, విశేషేణ=విశేషముగా, ప్రజానాం= ప్రజలయొక్క, పరిపాలనం=సంరక్షణయు, విశఃచ=వైశ్యునికి,కృషిగోర క్షవాణిజ్యం=సేద్యము గోరక్షణము వర్తకము,పరికీర్తితం (వృత్తికర్మ ముగా)చెప్పబడియున్నది.

మూ॥ శూద్రస్య ద్విజశుశ్రూషా సర్వశిల్పాని చాప్యధ।క్షమాస
త్యందమశ్శౌచం సర్వేషామవిశేషతః. ౫

టీ॥ శూద్రస్య=శూద్రునికి, ద్విజశుశ్రూషా= ద్విజులసేవ (ధర్మకర్మ ము) అథఅపి=మఱియు, సర్వశిల్పానిచ=అన్నిశిల్పములు (వృత్తికర్మము), క్షమా=ఓర్పు, సత్యం=యథార్థముచెప్పుట, దమః=మనోనిగ్రహము, శౌచః = శుచిత్వము,సర్వేషాం=అందరికి, అవిశేషతః = సామాన్య (ధ ర్మములు).

మూ॥ బ్రాహ్మణఃక్షత్రియో వైశ్య స్త్రయోవర్ణాద్విజాతయః।
తేషాం జన్మ ద్వితీయంతు విజ్ఞేయంమౌంజిబంధనాత్. ౬

టీ॥ బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, క్షత్రియః=క్షత్రియుఁడు, వైశ్యః=వై శ్యుఁడు, త్రయః=మూడు, వర్ణాః=వర్ణములవారు, ద్విజాతయః=రెండు జన్మములు కలిగినవారు, తేషాం=వారికి, ద్వితీయంతు= రెండవ, జన్మ = జన్మము, మౌంజీబంధనాత్= ఉపనయనము వలనను (అని), విజ్ఞేయం= తెలిసికొనదగినది.

మూ॥ ఆచార్యస్తుపితాప్రోక్తఃసావిత్రీ జననీతథా । బ్రాహ్మణక్షత్రి
యవిశాంమౌంజీ బంధనజన్మని. ౭

టీ॥ ఆచార్యఃతు=ఆచార్యుఁడు, బ్రాహ్మణ క్షత్రియవిశాం=బ్రహ్మక్షత్రి య వైశ్యులకు, మౌంజబంధనజన్మని = ఉపనయనమువలన కలిగిన జన్మము నందు, పితా=తండ్రి(అని) ప్రోక్తః= చెప్పబడెను, తథా = అటువలెనే, సావిత్రీ=గాయత్రి, జననీ=తల్లి(అనిచెప్పబడియున్నది).

మూ॥ విప్రాక్షూద్ర సమాస్తావద్విజ్ఞేయాస్తువిచక్షణైః । యావ

ద్వేదేన జాయంతే ద్విజాజ్ఞేయాస్తతః పరం. ౮

టీ॥ తు=మరియును, విప్రాః=బ్రాహ్మణులు, విచక్షణైః=తెలిసినవారి చేత, తావత్=అదివరకు (ఉపనయనమయ్యేవరకు), శూద్రసమాః=శూద్రసములుగా, విజ్ఞేయాః = తెలియబడదగినవారు, యావత్= ఎంతకాలమునకు, వైదేన=వేదముచేతను,జాయంతే= పుట్టుచున్నారో,తతఃపరం=ఆకాలమునకుపైన,ద్విజాః=ద్విజులు(అని)జ్ఞేయాః= తెలియబడతగినవారు.

ఇతి శ్రీశంఖస్మృతౌ ప్రథమోధ్యాయః.

టీ॥శంఖస్మృతౌ = శంఖస్మృతియందు, ప్రథమః=మొదటిదగు, అధ్యాయః=అధ్యాయము, ఇతి=సమాప్తినొందెను.

మూ॥ గర్భస్య స్ఫుటతాజ్ఞానే నిషేకః పరికీర్తితః। పురాతుస్పందనాత్కార్యం పుంసవనం తు విచక్షణైః. ౧

టీక॥ గర్భస్య=గర్భకోశముయొక్క, స్ఫుటతాజ్ఞానే=వికాసముతెలిసినకాలమందు,నిషేకః=నిషేకసంస్కారము, పరికీర్తితః=చెప్పబడియున్నది, స్పందనాత్పురాతు=గర్భమందుశిశువుకదలకమునుపు, విచక్షణైః=తెలిసినవారివలన, పుంసవనంతు = పుంసవనకర్మము, కార్యం=చేయదగినది.

మూ॥ షష్ఠేష్టమే వా సీమంతో జాతే వై జాతకర్మచ। ఆశౌచేతు వ్యతిక్రాంతే నామకర్మ విధీయతే. ౨

టీ॥ సీమంతః = సీమంతకర్మము, షష్ఠేష్టమేవా = ఆరవనెలలోగాని యెనిమిదవనెలలోగాని (చేయదగ్గది) జాతేవై =జనించగానే, జాతకర్మచ=జాతకర్మమును (చేయదగినది), తు=మఱియు, ఆశౌచే=పురుడు, వ్యతిక్రాంతే = తీరిపోగానే, నామకర్మ=నామకరణము, విధీయతే = విధింపబడుచున్నది.

మూ॥ నామధేయంచ కర్తవ్యం వర్ణానాంచ సమాక్షరమ్। మాం

గల్యం బ్రాహ్మణస్యోక్తం క్షత్రియస్య బలాన్వితం। వైశ్యస్య
ధనసంయుక్తం శూద్రస్యతు జుగుప్సితమ్. ౩

టీ॥ వర్ణానాంచ= (నాలుగు) వర్ణములకు, నామధేయంచ=పేరు, సమాక్షరం=సరిఅక్షరములుగలదిగా, కర్తవ్యం=చేయదగినది, బ్రాహ్మణస్య=బ్రాహ్మణునియొక్క(పేరు)మాంగల్యం=మంగళశబ్దయుక్తముగా, ఉక్తం=(ఉండవలయునని)చెప్పబడియున్నది, క్షత్రియస్య= క్షత్రియునియొక్క(పేరు)బలాన్వితం=బలశబ్దయుక్తముగా (ఉండవలయును)వైశ్యస్య = వైశ్యునియొక్క (పేరు) ధనసంయుక్తం=ధనపదయుక్తముగా (ఉండవలయు) శూద్రస్యతు = శూద్రునియొక్క (పేరు) జుగుప్సితం = దీనశబ్దయుక్తముగా(ఉండవలయును.)

మూ॥ శర్మాంతం బ్రాహ్మణస్యోక్తం వర్మాంతం క్షత్రియస్యచ ।
ధనాంతంచైవ వైశ్యస్య దాసాంతం చాంత్యజన్మనః. ౪

టీ॥ బ్రాహ్మణస్య=బ్రాహ్మణునియొక్క (పేరు), శర్మాంతం=శర్మ అనుపదము అంతముగలదిగా (ఉండవలయును) క్షత్రియస్యచ=క్షత్రియునియొక్క (పేరు) వర్మాంతం =వర్మ అనుపదము అంతమందుగలదిగాను (ఉండవలయు,)వైశ్యస్య=వైశ్యునియొక్క(పేరు)ధనాంతంచైవ = ధనపదము అంతమునందు గలదిగా (ఉండవలయును) అంత్యజన్మనః=శూద్రునియొక్క (పేరు) దాసాంతంచ= దాస అనే పదము అంతమునందు గలదిగా (ఉండవలయును)ఉక్తం -(అని) చెప్పబడియున్నది.

మూ॥ చతుర్థేమాసి కర్తవ్యో బాలస్యాదిత్యదర్శనమ్ ।
షష్ఠేన్నప్రాశనం మాసి చూడా కార్యాయథాకులమ్. ౫

టీక॥ బాలస్య= బాలకునికి, చతుర్థే= నాలుగవ, మాసి= మాసమందు, ఆదిత్యదర్శనం=సూర్యదర్శనము, కర్తవ్యం =చేయతగినది, షష్ఠే= ఆరవ, మాసి=మాసమందు, అన్నప్రాశనం= అన్నప్రాశనము,(చేయదగినది,) చూడా= జుట్టుపెట్టడము, యథాకులం, కులాచారముపోస్తుచు, కార్యా (పూర్వాదిభాగములందు) చేయదగినది.

( శంఖధర్మశాస్త్రమ్. )

మూ॥ గర్భాష్టమేబ్దే కర్తవ్యం బ్రాహ్మణస్యోపనాయనమ్।గ
ర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః. ౬

టీక॥ బ్రాహ్మణస్య=బ్రాహ్మణునికి, గర్భాష్టమే=గర్భము మొదలు ఎనిమిదవదగు, అబ్దే=సంవత్సరమందు. రాజ్ఞః= రాజునకు, గర్భాత్=గర్భము మొదలు, ఏకాదశే=పదునొకండవ (సంవత్సరమునందు) విశఃతు=వైశ్యునికి=గర్భాత్తు=గర్భము మొదలు. ద్వాదశే=పండ్రెండవ (సంవత్సరమునందు) ఉపనాయనం=ఉపనయనము, కర్తవ్యం=చేయదగినది.

మూ॥ షోడశాబ్దాని విప్రస్య రాజన్యస్య ద్వివింశతిః। వింశతిస్స
చతుష్కాతు వైశ్యస్య పరికీర్తితా। నాతివర్తేత
సావిత్రీ మతఊర్ధ్వం నివర్తయేత్. ౭

టీక॥ విప్రస్య=బ్రాహ్మణునికి, షోడశ= పదియారు, రాజన్యస్య=క్షత్రియునికి, ద్వివింశతిః=ఇరువదిరెండు, వైశ్యస్యతు=వైశ్యునికి, సచతుష్కావింశతిః=ఇరువదినాలుగు, అబ్దాని=సంవత్సరములు, పరికీర్తితా=(గౌణకాలముగా) చెప్పబడియున్నది, నఅతివర్తేత = (ఈకాలమును) అతిక్రమించకూడదు, అతఃఊర్ధ్వం=దీనికిపైన, సావిత్రీం=గాయత్రిని, నివర్తయేత్=ఉపదేశించకూడదు.

మూ॥ విజ్ఞాతవ్యాస్త్రయోప్యేతే యథాకాల మసంస్కృతాః।
సావిత్రీపతితా వ్రాత్యాః సర్వధర్మ బహిష్కృతాః. ౮

టీక॥ యథాకాలం=నిర్ణయించబడినకాలమందు, అసంస్కృతాః=ఉపనయనముకాబడక, ఏతే=ఈ, త్రయఃఅపి=మూడువర్ణములవారును, సావిత్రీపతితాః= గాయత్రీదానమునకు అయోగ్యులు గాను, వ్రాత్యాః=సంస్కారహీనులుగాను, సర్వధర్మబహిష్కృతాః=ఏధర్మములకు అధికారులుగాని వారలుగాను, విజ్ఞాతవ్యాః=తెలియబడదగినవారు.

మూ॥ మౌంజీజ్యాబంధనమయాః క్రమాన్మౌంజ్యః ప్రకీర్తితాః।
మార్గవైయాఘ్రబాస్తాని చర్మాణి బ్రహ్మచారిణామ్॥ ౯

టీక॥ బ్రహ్మచారిణాం = (మూడువర్ణముల) బ్రహ్మచారులకు, క్రమాత్ = వరుసగా, మౌంజ్యః = కటిసూత్రములు, మౌంజీజ్యాబంధనమయాః = ముంజిగడ్డి, వింటినారి, జనుపనార-వీనితో జేయబడినవిగా, ప్రకీర్తితాః = చెప్పబడియున్నవి, మార్గవైయాఘ్రబాస్తాని = నల్లజింక సంబంధిమైన, వ్యాఘ్రసంబంధిమైన, మేకసంబంధిమైన, చర్మాణి = చర్మములు (ఉత్తరీయములు)

మూ॥ పర్ణపిప్పలబిల్వానాం క్రమాద్దండాః ప్రకీర్తితాః। కేశలాలాటకర్ణైస్తు తుల్యాః ప్రోక్తాః క్రమేణతు॥౧౦

టీక॥ క్రమాత్ = వరుసగా, పర్ణపిప్పలబిల్వానాం = మోదుగ రావి మారేడులయొక్క, దండాః = దండములు, ప్రకీర్తితాః = (ధరించదగినవిగా) చెప్పబడియున్నవి, క్రమేణతు = వరుసగానే (దండములు) కేశలాలాటకర్ణైః తు = జుట్టు, నొసలు, చెవులతోను, తుల్యాః = సమాన, (నిడివి) గలవిగా, ప్రోక్తాః = చెప్పబడియున్నవి,

మూ॥ అవక్రాస్సత్వచస్సర్వే నాగ్నిదగ్ధాస్తథైవచ। వస్త్రోపవీతే కార్పాసక్షౌమోర్ణానాం యథాక్రమమ్॥౧౧

టీక॥ సర్వే = అన్నిదండములు, అవక్రాః = వంపులేనివిగా, సత్వచః = బరడుతో చేరినవిగా, తథాఏవచ = అదేప్రకారము, నాగ్నిదగ్ధాః = నిప్పుచేత కాలనవిగా (ఉండవలయును) వస్త్రోపవీతే = వస్త్రము, యజ్ఞోపవీతము, యథాక్రమం = వరుసగా, కార్పాసః = ప్రత్తి, క్షౌమ = పట్టు, ఊర్ణానామ్ = గొర్రెబొచ్చు (తోచేయబడినవిగానుండవలయును).

మూ॥ ఆదిమధ్యావసానేషు భవచ్ఛబ్దోపలక్షితమ్। భైక్షస్యాచరణంప్రోక్తం వర్ణానామనుపూర్వశః॥ ౧౨

టీక॥ భైక్షస్యఆచరణం = భిక్షాన్నముతీసుకొనుమంత్రము, వర్ణానాం = (బ్రాహ్మణాది) వర్ణములకు, అనుపూర్వశః = వరుసగా, ఆదిమధ్యావసానేషు = ఆదిమందు, మధ్యమందు, అంతమునందు, భవచ్ఛబ్దోపలక్షితం = భవతిఅనే శబ్దముతో గూడినదిగా, ప్రోక్తం = చెప్పబడియున్నది.

ఇతి శంఖస్మృతౌ ద్వితీయోధ్యాయః.

శంఖస్మృతౌ=శంఖస్మృతియందు,ద్వితీయః అధ్యాయః, రెండవఅధ్యాయము, ఇతి=ముగిసెను.

మూ॥ ఉపనీయ గురుశ్శిష్యం శిక్షయేచ్ఛౌచమాదితః। ఆచారమగ్నికార్యంచ సంధ్యోపాసన మేవచ॥ ౧

టీక॥ గురుః=గురువు, శిష్యం=శిష్యుని,ఉపనీయ=ఉపనయనముచేసి, ఆదితః=మొదట,శౌచం=హస్తపాదాదిశుద్ధిని,ఆచారం=ఆచారమును, అగ్నికార్యంచ=అగ్నికార్యమును,సంధ్యోపాసనంఏవచ=సంధ్యావందనమును, శిక్షయేత్=నేర్పింపవలయును,

మూ॥ స గురుర్యః క్రియాః కృత్వా వేదమస్మై ప్రయచ్ఛతి। భృతకాధ్యాపకోయస్తు ఉపాధ్యాయ స్స ఉచ్యతే॥ ౨

టీక॥ యః=ఎవఁడు,క్రియాః= (ఉపనయనాది) క్రియలను, కృత్వా=చేసి, అస్మై=వీనికొఱకు(వటువుకొఱకు) వేదం=వేదమును, ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాఁడో,సః=వాఁడు,గురుః=గురువు,యఃతు=ఎవఁడు,భృతకాధ్యాపకః=జీతముతీసికొనిఅధ్యయనముచేయించుచున్నాఁడో,సః=వాఁడు,ఉపాధ్యాయః=ఉపాధ్యాయుఁడుగా,ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడు.

మూ॥ మాతాపితాగురుశ్చైవ పూజనీయా స్సదానృణామ్ । క్రియా స్తస్యాఽఫలాస్సర్వాఃయస్యైతేనాదృతాస్త్రయః. ౩

టీక॥ నృణాం=మనుష్యులకు, మాతా=తల్లి, పితా=తండ్రి,గురుఃచఏవ=గురువు,సదా=ఎల్లప్పుడు, పూజనీయాః=పూజింపదగినవారు.యస్య=ఎవనికి, ఏతే=ఈ, త్రయః=ముగ్గురు,అనాదృతాః=ఆదరింపబడకయుంటున్నారో, తస్య=వానికి, సర్వాః=అన్ని,క్రియాః=క్రియలు, అఫలాః = నిష్ఫలములు.

మూ॥ ప్రయతః కల్య ఉత్థాయ స్నాతో హుతహుతాశనః। కుర్వీత

ప్రణతోభూత్వా గురూణా మభివాదనమ్॥ ౪

టీక॥ కల్యే=ప్రాతఃకాలమందు, ఉత్థాయ=లేచి, ప్రయతః= పవిత్రుఁడై, స్నాతః=స్నానముచేసినవాఁడై, హుతహుతాశనః=హోమముచేయబడిన అగ్నికలవాఁడై, ప్రణతః=నమ్రుఁడుఁగా,భూత్వా=ఉండుకొని,గురూణాం=గురువులకు, అభివాదనం=నమస్కారమును, కుర్వీత = చేయవలయును.

మూ॥ అనుజ్ఞాతస్తు గురుణా తతోధ్యయనమాచరేత్ । కృత్వా బ్రహ్మాంజలిం పశ్యేద్గురోర్వదనమానతః. ౫

తు=మరియును,గురుణా=గురువుచేత,అనుజ్ఞాతః=అనుజ్ఞనుపొందినవాఁడై తతః=అనంతరము, బ్రహ్మాంజలింకృత్వా, చేతులుమొగుడించుకొని,గురోః=గురువుయొక్క, వదనం=ముఖమును, పశ్యన్=చూచుచు , ఆనతః=నమ్రుఁడై, అధ్యయనంఆచరేత్ = అధ్యయనమునుచేయవలయు.

మూ॥ బ్రహ్మావసానే ప్రారంభే ప్రణవంచ ప్రకీర్తయేత్ । అనధ్యాయేష్వధ్యయనం వర్జయేచ్చ ప్రయత్నతః. ౬

టీ॥ చ=మరియును, బ్రహ్మావసానే = వేదముముగించుటయందు= ప్రారంభే= ఆరంభించుటయందు, ప్రణవం=ప్రణవమును, ప్రకీర్తయేత్= ఉచ్చరింపవలయును, చ-మఱియును , అనధ్యాయేషు = అధ్యయనముచేయరానిదినములలో, ప్రయత్నతః=యత్నముతోను.అధ్యయనం=అధ్యయనమును,వర్జయేత్ =విడిపించవలయును.

మూ॥ చతుర్దశీం పంచదశీ మష్టమీం రాహుసూతకమ్। ఉల్కాపాతం మహీకంప మాశౌచం గ్రామవిప్లవమ్। ఇంద్రప్రయాణం సురతం ఘనసంఘాతనిస్వనమ్। వాద్యకోలాహలం యుద్ధ మనధ్యాయా న్వివర్జయేత్. ౭

టీ॥ చతుర్దశీం=చతుర్దశిని, పంచదశీం=అమావాస్యనుపూర్ణిమను,అష్టమీం = అష్టమిని, రాహుసూతకం = గ్రహణమును , పురుడును,

ఉల్కాపాతం = ఆకాశమునుండి మంటలేని కట్టెనిప్పుపడుటయును, మహీకంపం=భూకంపమును, ఆశౌచం = మృతాశౌచమును, గ్రామవిప్లవం = గ్రామముయొక్క ఉపద్రవమును, ఇంద్రప్రయాణం = ఇంద్రధ్వజమునెక్కించుదినమును, సురతం = సంభోగదినమును , ఘనసంఘాతనిస్వనం = మేఘముగర్జించినదినమును, వాద్యకోలాహలం = వాద్యములతో కలకలఅయినదినమును, యుద్ధం=యుద్ధదినమును, అనధ్యాయాన్= (ఈ) అధ్యయనముచేయరానిదినములను, వివర్జయేత్ = విడిపించవలయును.

మూ॥ నాధీయీతాభియుక్తో పి యానగో నచ నౌగతః । దేవాయతనవల్మీకశ్మశానశవసన్నిధౌ. ౯

టీ॥ అభియుక్తః= (ద్రవ్యనుమూలముగా ఇతరులచేత) ప్రేరేపణచేయబడినవాఁడు, నఅధీయీత=అధ్యయనముచేయకూడదు, యానగఃఅపి = వాహనమునుఎక్కినవాఁడు, నౌగతఃచ = పడవమీదఎక్కినవాఁడును, న= అధ్యయనముచేయకూడదు, దేవాయతనవల్మీకశ్మశానశవసన్నిధౌ=దేవాలయము పుట్ట శ్మశానము పీనుగు వీనిదగ్గిర (అధ్యయనముచేయకూడదు).

మూ॥ భైక్షచర్యాం తథా కుర్యాద్బ్రాహ్మణేషు యథావిధి ।
గురుణా చాభ్యనుజ్ఞాతః ప్రాశ్నీయాత్ప్రాఙ్ముఖశ్శుచిః. ౧౦

టీ॥ బ్రాహ్మణేషు=బ్రాహ్మణగృహములయందు, యథావిధి=శాస్త్రమువీరీతియో, తథా=అట్లు, భైక్షచర్యాం=భిక్షాచరణమును,కుర్యాత్=చేయవలయును, గురుణా= గురువుచేత , అభ్యనుజ్ఞాతఃచ = అనుజ్ఞనుపొందినవాఁడై, ప్రాఙ్ముఖః=తూర్పుముఖముగలవాఁడై, శుచిః=శుద్ధుఁడై,ప్రాశ్నీయాత్ = భోజనముచేయవలయును.

మూ॥ హితం ప్రియం గురోః కుర్యాదహంకారవివర్జితః. ౧౧

టీ॥ హితం=మేలుకలుగచేయునట్టి, ప్రియం=ఇష్టమైన(కార్యమును),గు

రోః=గురువునకు, అహంకారవివర్జితః=అహంకారములేనివాఁడై,కుర్యా
త్= చేయవలయును.

మూ॥ ఉపాస్య పశ్చిమాం సంధ్యాం పూజయిత్వా హుతాశనమ్।
అభివాద్య గురుం పశ్చాద్గురో ర్వచనకృద్భవేత్ । గురోః
పూర్వం సముత్తిష్ఠేచ్ఛయీత చరమం తథా. ౧౨

టీ॥ పశ్చిమాంసంధ్యాం = సాయంసంధ్యను, ఉపాస్య=ధ్యానముచేసి,
హుతాశనం=అగ్నిని, పూజయిత్వా= పూజచేసి , గురుం=గురువును, అ
భివాద్య=నమస్కరించి, పశ్చాత్ = వెనుక , గురోః=గురువుయొక్క-వచ
నకృత్=చెప్పినమాటను నెరవేర్చువాఁడుగా, భవేత్= ఉండవలయును, గు
రోః=గురువునకంటె, పూర్వం = ముందర, సముత్తిష్ఠేత్= (నిద్ర) లేవ
వలయును, తథా=అటువలెనే, చరమం = గురువునకువెనుక, శయీత =
పండుకొనవలయును.

మూ॥ మధుమాంసాంజనం శ్రాద్ధం గీతం నృత్యం చ వర్జయేత్ ।
హింసాం పరాపవాదంచ స్త్రీలీలాంచ విశేషతః. ౧౩

టీ॥ మధుమాంసాంజనం = సారాయిని, మాంసమును,కాటుకను.శ్రా
ద్ధం=శ్రాద్ధభోజనమును, గీతం=పాటను, నృత్యంచ = ఆటను, హింసాం =
హింసను, పరాపవాదంచ=పరనిందను , విశేషతః=ముఖ్యముగా , స్త్రీలీ
లాంచ=స్త్రీలతోఆటను, వర్జయేత్ =విడిపించవలయును.

మూ॥ మేఖలా మజినం దండం ధారయేచ్చవిశేషతః । అధశ్శా
యీ భవే న్నిత్యం బ్రహ్మచారీ సమాహితః. ౧౪

టీక॥ బ్రహ్మచారీ=బ్రహ్మచారి, సమాహితః = జాగరూకుఁడై,విశేష
తః=ముఖ్యముగా, మేఖలాం=(మౌంజి)మొలత్రాడును, అజినం=చర్మో
త్తరీయమును, దండం=దండమును,ధారయేత్ చ = ధరించుచుండవలయు
ను, నిత్యం = ప్రతిదినము, అధశ్శాయీభవేత్ = నేలమీదపండుకొన
వలయును.

మూ॥ ఏవం వ్రతంతు కుర్వీత వేదస్వీకరణం బుధః। గురవేచ ధనం దత్వా స్నాయాచ్చ తదనుజ్ఞయా. ౧౫

టీక॥ బుధః = తెలివిగలవాఁడు, వేదస్వీకరణం = వేదస్వీకారము ను, ఏవంతు = ఇట్టి, వ్రతం = వ్రతముకలదిగానే, కుర్వీత = చేయ వలయును, గురవేచ = గురువుకొరకు, ధనం = దక్షిణాద్రవ్యమును, ద త్వా=ఇచ్చి, తదనుజ్ఞయా=వారిసెలవుచేత, స్నాయాత్ చ=స్నాతకముచే సికొనవలయును.

ఇతి శ్రీశంఖస్మృతౌ - తృతీయోధ్యాయః.

టీ॥ శంఖస్మృతౌ=శంఖస్మృతియందు, తృతీయః = మూడవదియగు, అధ్యాయః,=అధ్యాయము, ఇతి=ముగిసెను.







## అథ శంఖస్మృతౌ చతుర్థాఽధ్యాయప్రారంభః.

మూ॥ విందేత విధివద్భార్యా మసమానార్షగోత్రజామ్ । మా
తృతః పంచమీం చాపి పితృతస్త్వథ సప్తమీమ్. ౧

టీ॥ అసమానార్షగోత్రజాం = సమానప్రవరగోత్రమందుపుట్టని , అపిచ=ఇంక, మాతృతః = తల్లివంకను , పంచమీం = అయిదవదిగాను , అథతు=ఇంక, పితృతః= తండ్రివంకను, సప్తమీం = ఏడవసంఖ్యగలదిగాను(ఉండేకన్యను),భార్యాం=భార్యనుగా,విధివత్=శాస్త్రప్రకారము, విందేత=వివాహము చేసికోవలయును.

మూ॥ బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః ।
గాంధర్వో రాక్షస శ్చైవ పైశాచ శ్చాష్టమోఽధమః. ౨

టీ॥ బ్రాహ్మః=బ్రాహ్మవివాహము, దైవః=దైవవివాహము,తథా=ఏవ అటువలెనే, ఆర్షః=ఆర్షవివాహము, ప్రాజాపత్యః = ప్రాజాపత్యవివాహము, తథా=అటువలెనే, ఆసురః= ఆసురవివాహము, గాంధర్వః= గాంధర్వవివాహము , రాక్షసఃచఏవ= రాక్షసవివాహము , పైశాచః=చ,పైశాచకవివాహము(అనివివాహములుఎనిమిదివిధములు)అష్టమః=ఎనిమిదవది, అధమః=అన్నిటికితక్కువైనది.

మూ॥ ఏతే ధర్మ్యా స్తు చత్వారః పూర్వం విప్రే ప్రకీర్తితాః ।
గాంధర్వోరాక్షసశ్చైవ క్షత్రియస్య ప్రశస్యతే. ౩

టీ॥ఏతే=ఈ,పూర్వం=మొదటివగు,చత్వారఃతు=నాలుగు(వివాహములు) విప్రే=బ్రాహ్మణునివిషయమై , ధర్మ్యాః = ధర్మమునుఅనుసరించినవిగా, ప్రకీర్తితాః=చెప్పబడియున్నవి, క్షత్రియస్య=క్షత్రియునికి, గాంధర్వః= గాంధర్వవివాహమును, రాక్షసఃచఏవ=రాక్షసవివాహమును,ప్రశస్యతే = చెప్పబడియున్నవి.

మూ॥ అప్రార్థితః ప్రయత్నేన బ్రాహ్మస్తు పరికీర్తితః । య
జ్ఞస్థాయర్త్విజే దైవ ఆదాయార్షస్తు గోద్వయమ్. ౪

టీక॥ బ్రాహ్మః=బ్రాహ్మవివాహము, ప్రయత్నేన = యత్నముతోటి, అప్రార్థితః=కోరబడక (సంభవించినదిగా) పరికీర్తితః = చెప్పబడియున్నది, దైవః=దైవమనువివాహము, యజ్ఞస్థాయ=యజ్ఞమందునియుక్తుఁడైన, ఋత్విజే=ఋత్విజునికొరకు(ఇవ్వబడుకన్యావివాహము) ఆర్షః తు=ఆర్షమనువివాహము, గోద్వయం=రెండుఆవులను, ఆదాయ తు=తీసుకొని(ఇచ్చేకన్యావివాహము)

మూ॥ ప్రార్థితాయ ప్రదానేన ప్రాజాపత్యః ప్రకీర్తితః ।
ఆసురో ద్రవిణాదానాద్గాంధర్వస్సమయాన్మిథః ।
రాక్షసో యుద్ధహరణాత్పైశాచః కన్యకాంఛలాత్. ౫

టీక॥ ప్రాజాపత్యః=ప్రాజాపత్యవివాహము, ప్రార్థితాయ=ప్రార్థించినవానికొరకు, ప్రదానేన=ఇచ్చుటచేత (కలిగినవివాహముగా) ప్రకీర్తితః=చెప్పబడియున్నది, ఆసురః=అసురవివాహము, ద్రవిణాదానాత్=ద్రవ్యముతీసుకొని(ఇచ్చేకన్యావివాహము) గాంధర్వః=గాంధర్వవివాహము. మిథః = వధూవరులొండొరులు, సమయాత్=(చేసికొనిన)సంకేతమువలన(కలిగేవివాహము) యుద్ధహరణాత్=యుద్ధమందు హరించుట వలన (కలిగేవివాహము) రాక్షసః=రాక్షసవివాహము, ఛలాత్=మోసమువలన, కన్యకాం=కన్యకను (తీసికొనిపోయిచేయువివాహము) పైశాచః = పైశాచవివాహము.

మూ॥ తిస్రస్తు భార్యా విప్రస్య ద్వే భార్యే క్షత్రియస్యతు। ఏ
కైవభార్యా వైశ్యస్య తథా శూద్రస్య కీర్తితా. ౬

టీ॥ విప్రస్య=బ్రాహ్మణునికి, భార్యాః తు=భార్యలు, తిస్రః=ముగ్గురు, క్షత్రియస్యతు — క్షత్రియునికి, భార్యే=భార్యలు, ద్వే- ఇద్దరు, వైశ్యస్య వైశ్యునికి. భార్యా= భార్య, ఏకాఏవ = ఒక్కతే, తథా—అప్రకారమే, శూద్రస్య= శూద్రునికి, కీర్తితా = చెప్పబడియున్నది.

మూ॥ బ్రాహ్మణీ క్షత్రియా వైశ్యా బ్రాహ్మణస్య ప్రకీర్తితాః ।
క్షత్రియాచైవ వైశ్యాచ క్షత్రియస్యవిధీయతే । వైశ్యాచ
భార్యావైశ్యస్య శూద్రా శూద్రస్య కీర్తితా. ౮

టీక॥ బ్రాహ్మణస్య=బ్రాహ్మణునికి, బ్రాహ్మణీ=బ్రాహ్మణజాతీయురాలు, క్షత్రియా = క్షత్రియజాతీయురాలు, వైశ్యా= వైశ్యజాతీయురాలును, ప్రకీర్తితాః= చెప్పబడియున్నారు, క్షత్రియస్య = క్షత్రియునికి, క్షత్రియాచఏవ=క్షత్రియజాతీయురాలును, వైశ్యాచ = వైశ్యజాతీయురాలును, విధీయతే=విధింపబడియున్నారు, వైశ్యస్య=వైశ్యునికి, వైశ్యాచ =వైశ్యజాతీయురాలే, భార్యా=భార్య(గానుండవలయును), శూద్రస్య=శూద్రునికి, శూద్రా = శూద్రజాతీయురాలే, కీర్తితా = చెప్పబడియున్నది.

మూ॥ ఆపద్యపి నకర్తవ్యా శూద్రా భార్యా ద్విజన్మనా। త
స్యాంతస్య ప్రసూతస్య నిష్కృతి ర్నవిధీయతే. ౯

టీ॥ ద్విజన్మనా=ద్విజునిచేత, ఆపదిఅపి = ఆపత్కాలమందును, శూద్రా=శూద్రజాతీయురాలు, భార్యా=భార్యగా, నకర్తవ్యా=చేయదగినదికాదు, తస్యాం=దానియందు (శూద్రురాలియందు), ప్రసూతస్య= పుట్టిన, తస్య=వానికి, నిష్కృతిః = ప్రాయశ్చిత్తము, నవిధీయతే= విధింపబడియుండలేదు.

మూ॥ తపస్వీ యజ్ఞశీలశ్చ సర్వధర్మభృతాంవరః । ధ్రువంశూ
ద్రత్వమాయాతి శూద్రశ్రాద్ధే త్రయోదశే. ౧౦

టీ॥ తపస్వీ=తపస్సుకలిగిన, యజ్ఞశీలఃచ=యజ్ఞముచేసేస్వభావము కలిగిన, సర్వధర్మభృతాం = సర్వధర్మములు చేయువారలలో, వరః = శ్రేష్ఠుఁడైన (పురుషుఁడు), త్రయోదశే=పదమూడో (దినమందుచేయవలసిన), శూద్రశ్రాద్ధే=శూద్రకర్తృకసపిండీ కరణశ్రాద్ధమందు, ధ్రువం=నిశ్చయముగా, శూద్రత్వం=శూద్రత్వమును, ఆయాతి = పొందుచున్నాఁడు.

మూ॥ నియమంతే తు సపిండత్వం యేషాంశూద్రః కులోద్భవః ।
సర్వేశూద్రత్వ మాయాంతి యది సగర్జితశ్చ తే. ౧౧

టీ॥ తు=మఱియును, యేషాం=ఎవరికి, శూద్రః=శూద్రుఁడు, కులోద్భవః=కులమందుఁబుట్టినవాఁడో, తే=వారు, సర్వే=అందరు, సపిండత్వం = సాపిండ్యమును, నీయంతే= పొందింపఁబడుచున్నారు,స్వర్గజితఃచయిది=స్వర్గమందున్నవారైనను, శూద్రత్వం=శూద్రత్వమును.ఆయాంతి=పొందుచున్నారు.

మూ॥ సపిండీకరణం కార్యం కులజస్య యథాధ్రువమ్ । శ్రాద్ధ ద్వాదశకం కృత్వా శ్రాద్ధే ప్రాప్తే త్రయోదశే.౧౨

టీ॥ కులజస్య = కులమందుపుట్టినవానికి (పుట్టినవానిచేత) శ్రాద్ధద్వాదశకం=పండ్రెండుశ్రాద్ధములను,కృత్వా=చేసి ,త్రయోదశే=పదమూడవదగు,శ్రాద్ధేప్రాప్తే=శ్రాద్ధముతటస్థించినపుడు,తథా=అప్రకారమే, సపిండీకరణం=సపిండీకరణమును,ధ్రువం=నిశ్చయముగా, కార్యం=చేయఁదగ్గది.

మూ॥ సపిండీకరణేచాఽర్హః నచశూద్రః కథంచన । తస్మాత్సర్వప్రయత్నేన శూద్రాభార్యాం వివర్జయేత్. ౧౩

టీ॥ సపిండీకరణేచ= సపిండీకరణమందును , శూద్రః=శూద్రుఁడు, కథంచన=కొంచెమైనను,నచఅర్హః=అర్హుఁడుకాఁడు, తస్మాత్=కనుక, సర్వప్రయత్నేన= అన్నిప్రయత్నములతోను, శూద్రాభార్యాం= శూద్రజాతీయురాలైనభార్యను, వివర్జయేత్= (ద్విజుఁడు) వర్జించవలయును.

మూ॥పాణిగ్రాహ్యస్సవర్ణాసు గృహ్ణీయాత్క్షత్రియాశరమ్। వైశ్యా ప్రతోదమాదద్యా ద్వేదనే త్వగ్రజన్మనః. ౧౪

టీక॥ సవర్ణాసు=సమానవర్ణముస్త్రీలయందు, (వివాహముచేయునపుడు) పాణిగ్రాహ్యః = వరునియొక్కహస్తముపట్టవలయును, అగ్రజన్మనః=మొదటివర్ణమువానియొక్క, వేదనేతు = వివాహమందు, క్షత్రియా=క్షత్రియస్త్రీ, శరం=బాణమును, గృహ్ణీయాత్=పట్టుకోవలయును, వైశ్యా = వైశ్యస్త్రీ, ప్రతోదం=కొరడాను, ఆదద్యాత్ = పట్టుకోవలయును.

మూ॥ సా భార్యా యా గృహే దక్షా సాభార్యా యా పతివ్రతా।
సాభార్యా యా పతిప్రాణా సాభార్యా యా ప్రజావతీ. ౧౫

టీక॥ యా=ఎవతె, గృహే=గృహస్థాశ్రమముయొక్క, (పనియందు) దక్షా=సమర్థురాలో, సా=ఆమె, భార్యా=భార్య (అనిచెప్పతగినది) యా=ఎవతె, పతివ్రతా=పాతివ్రత్యముగలదో, సా=ఆమె, భార్యా=భార్య, (అనిచెప్పతగ్గది) యా=ఎవతె, పతిప్రాణా = భర్తనేప్రాణతుల్యుఁడుగావించుచున్నదో, సా=ఆమె, భార్యా=భార్య (అనిచెప్పతగ్గది), యా= ఎవతె, ప్రజావతి=బిడ్డలుగలిగినదో, సా=ఆమె, భార్యా=భార్య (అనిచెప్పతగ్గది).

మూ॥ లాలనీయా సదాభార్యా తాడనీయా తథైవచ। తాడితా
లాలితా చైవ స్త్రీశ్రీ భర్భవతి నాన్యథా. ౧౬

టీ॥ భార్యా=భార్య, సదా=ఎల్లప్పుడు, లాలనీయా=బుజ్జగించబడదగినది, తథాఏవచ=అటువలెనే, తాడనీయా= (అయుక్తముగానడిచేయుడల) శిక్షింపబడదగినది, తాడితా=శిక్షింపబడిన, లాలితాచఏవ=బుజ్జగించబడిన, స్త్రీ=స్త్రీ, శ్రీః= (గృహ) లక్ష్మిగా, భవతి=అగుచున్నది, అన్యథా=అటుకాకపోతే, న= కాదు.

ఇతి

శంఖస్మృతౌ చతుర్థోఽధ్యాయః.

టీ॥ శంఖస్మృతౌ=శంఖస్మృతియందు, చతుర్థః=నాలుగవదగు, అధ్యాయః=అధ్యాయము, ఇతి=ముగిసెను.





శ్రీ

## అథశంఖస్మృతౌ

### పంచమాధ్యాయప్రారంభః.

మూ॥ పంచసూనా గృహస్థస్య చుల్లీ పేష ణ్యుపస్కరః । ఖండ నీ చోదకుంభశ్చ తస్యపాపస్యశాంతయే । పంచయజ్ఞ వి ధానంతు గృహీ నిత్యం నహాపయేత్ । పంచయజ్ఞ విధా నేనతత్పాపం తస్య నశ్యతి. ౨

టీ॥ గృహస్థస్య=గృహస్థునికి, చుల్లీ=పొయ్యి, పేషణీ=సన్నెకల్లు, ఉప స్కరః=చీపురు మొదలయిన ఉపకరణములు, ఖండనీచ = రోలురోకలి,ఉద కుంభఃచ=నీటికుండ, పంచ= (అను) అయిదు, సూనాః = హింసాకరణ ములు (కలుగుచున్నవి), తస్య=ఆ, పాపస్య = పాపముయొక్క , శాంత యే=శాంతికొరకు, గృహీతు=గృహస్థుఁడు, పంచయజ్ఞవిధానం=అయిదు యజ్ఞముల యొక్క చేయడమును, నిత్యం=ప్రతిదినము, నహాపయేత్=విడు వకూడదు, పంచయజ్ఞవిధానేన=అయిదుయజ్ఞములనుచేయడముచేతను , తత్ పాపం=ఆపాపము, తస్య=వానికి,నశ్యతి = నశించుచున్నది.

మూ॥ దేవయజ్ఞో భూతయజ్ఞః పితృయజ్ఞ స్తథైవచ । బ్రహ్మ యజ్ఞో నృయజ్ఞశ్చ పంచయజ్ఞాః ప్రకీర్తితాః. ౩

టీ॥ దేవయజ్ఞః= దేవయజ్ఞము, భూతయజ్ఞః= భూతయజ్ఞము , పితృ యజ్ఞః=పితృయజ్ఞము, తథాఏవచ= అటువలెనే, బ్రహ్మయజ్ఞః = బ్రహ్మ యజ్ఞము, నృయజ్ఞఃచ= మనుష్యయజ్ఞము , పంచ=(అనె)అయిదు, యజ్ఞాః యజ్ఞములు, ప్రకీర్తితాః=చెప్పబడియున్నవి.

మూ॥ హోమో దైవో బలి ర్భౌతః పిత్ర్యః పిండక్రియాస్మృతః । స్వాధ్యాయో బ్రహ్మయజ్ఞశ్చ నృయజ్ఞో ఽతిథిపూజనమ్. ౪

అగ్నికార్యముచేతను,వివిధేన=నానావిధములైన, స్నానేనచ=స్నానముచేతను, దివం=స్వర్గమును, నయాతి=పొందడు, భోజనవర్జనాత్=భోజనమువిడుచుటచేత,యాతి=పొందుచున్నాడు.

మూ॥ నదండైర్నచమౌనేన,శూన్యాగారాశ్రమేణచ।యతిస్సిద్ధిమవాప్నోతి సదా మైథునవర్జనాత్.౧౨

టీక॥ యతిః=యతి, దండైః=దండములచేత , సిద్ధిం=(జ్ఞాన)సద్ధిని, న అవాప్నోతి = పొందడు , మౌనేనచ = మౌనమువల్లను , న=పొందడు , శూన్యాగారాశ్రమేణచ=కాపురములేనిఇంటిలోనుండుటచేతను,న=పొందడు , మైథునవర్జనాత్ = స్త్రీసంగపరిత్యాగము వలన,అవాప్నోతి= (స్వర్గమును) పొందుచున్నాడు.

మూ॥ నయజ్ఞైర్దక్షిణావద్భి, ర్వహ్నిశుశ్రూషయాతథా।
గృహీ స్వర్గ మవాప్నోతియథా చాతిథి పూజనాత్.౧౩

టీక॥ గృహీ=గృహస్థుడు, అతిథిపూజనాత్ చ = అతిథిపూజనమువలన, యథా = ఎటువలె , స్వర్గం=స్వర్గమును, అవాప్నోతి=పొందుచున్నాడో, తథా = అటువలె, దక్షిణావద్భిః = యథోక్తదక్షిణలుకలిగిన. యజ్ఞైః = యజ్ఞములచేతను, వహ్నిశుశ్రూషయా, అగ్నికార్యము చేతను, న=పొందడు.

మూ॥తస్మాత్సర్వ ప్రయత్నేన,గృహస్థోఽతిథి మాగతమ్। ఆహారశయనాద్యేన విధివ త్ప్రతిపూజ యేత్. ౧౪

టీక॥ తస్మాత్ =కనుక, గృహస్థః= గృహస్థుడు , సర్వప్రయత్నేన= అన్నిప్రయత్నములచేతను, ఆగతం=(కాలమందు) వచ్చిన, అతిథిం= అతిథిని, ఆహారశయనాద్యేన=అన్నము పడక మొదలైనదానిచేత, విధివత్= శాస్త్రప్రకారము, ప్రతిపూజయేత్ = పూజించవలయును.

మూ॥సాయం ప్రాతశ్చ జుహుయా, దగ్నిహోత్రం యథావిధి।
దర్శంచ పౌర్ణమాసంచ జుహుయా ద్విధివత్తథా. ౧౫

టీక॥ సాయం=సాయంకాలమందు, ప్రాతఃచ=ప్రాతః కాలమందును, యథావిధి = శాస్త్రప్రకారము , అగ్నిహోత్రంజుహుయాత్ = అగ్ని కార్యమును చేయవలయును, తథా=అటువలెనే,దర్శంచ=అమావాస్య ఇష్టిని,పౌర్ణమాసంచ=పున్నమఇష్టిని,విధివత్ =శాస్త్రప్రకారము, జుహుయాత్=యజించవలయును.

మూ॥ యజేత పశుబంధైశ్చచాతుర్మాస్యైస్తథైవచ। త్రైవర్షికాధికాన్నస్తు పిబెత్సోమ మతంద్రితః. ౧౬

టీక॥ పశుబంధైఃచ=పశుబంధములచేత, తథాఏవచ=అటువలెనే, చాతుర్మాస్యైః=చాతుర్మాస్యఇష్టులచేత , యజేత = యాగముచేయవలయును , త్రైవర్షికాధికాన్నఃతు=మూడు సంవత్సరములకు పైబడిన అన్నముగలవాడు, అతంద్రితః=ఆలస్యములేనివాడై, సోమం=సోమరసమును, పిబేత్=త్రాగవలయును.

మూ॥ ఇష్టిం వైశ్వానరీం కుర్యాత్తథాచాల్ప ధనోద్విజః।నభిక్షేత ధనం శూద్రాత్సర్వం దద్యాదపీప్సితమ్. ౧౭

టీ॥ తథాచ=అదేప్రకారము, అల్పధనః=కొంచము ధనముగల,ద్విజః=ద్విజుడు, వైశ్వానరీం= వైశ్వానరీఅనే, ఇష్టిం=ఇష్టిని, కుర్యాత్= చేయవలయును,ఈప్సితం = కోరినటువంటి,సర్వం=అన్నిటిని, దద్యాత్ అపి=ఇచ్చినప్పటికిని, శూద్రాత్ = శూద్రునివల్లనుంచి, ధనం=ధనమును, నభిక్షేత= యాచించకూడదు.

మూ॥ వృత్తంతు నత్యజే ద్విద్వాన్ ఋత్విజం పూర్వమేవచ। కర్మణా జన్మనాశుద్ధం విద్యాత్పాత్రం వలీతతమ్. ౧౮

టీక॥ విద్వాన్=తెలిసినవాఁడు, వృత్తంతు=సదాచారమును, పూర్వం ఏవచ=మొదటినుంచి ఉండే, ఋత్విజం = ఋత్విజుని,నత్యజేత్=విడిపించకూడదు, కర్మణా=కర్మచేతను, జన్మనా=జన్మచేతను, శుద్ధం=పవిత్రుడైనటువంటి, వలీతతం=వృద్ధుని, పాత్రం=దానపాత్రునిగా,విద్యాత్ =

తెలిసికొనవలయును.

మూ॥ ఏతైరేవ గుణైర్యుక్తం ధర్మార్జిత ధనంతథా। యాజ
యేత్తు సదా విప్రో గ్రాహ్యస్తస్మాత్ప్రతిగ్రహః. ౧౫

టీక॥ తు=మరియ్యును, ఏతైః=ఈ, గుణైఃఏవ=గుణములతోడను, యుక్తం=కూడుకొనినవానిని, తథా=అటువలెనే, ధర్మార్జితధనం=ధర్మమార్గముచేత సంపాదించబడినధనముగలవానిని, విప్రః=బ్రాహ్మణుడు, సదా=ఎల్లప్పుడు, యాజయేత్=యాగముచేయింపవలయును, తస్మాత్=వానివలన, ప్రతిగ్రహః=దక్షిణాద్రవ్యము, గ్రాహ్యః=గ్రహింపతగినది,

ఇతిశంఖస్మృతౌ=పంచమోధ్యాయః.

టీక॥ శంఖస్మృతౌ = శంఖస్మృతియందు , పంచమః =అయిదవదగు అధ్యాయః=అధ్యాయము, ఇతి = ముగిసెను.





## అథశంఖస్మృతౌ

### షష్ఠాధ్యాయప్రారంభః.

మూ॥గృహస్థస్తు యదా పశ్యేద్వలీపలిత మాత్మనః।అపత్యస్యై
వ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్॥ ౧

టీక॥ గృహస్థః తు=గృహస్థుడు, యదా=ఎప్పుడు, వలీపలితం=(శరీర మందు) ముడతలను (వెంట్రుకలు) నెరుసుటను,అపత్యస్యఏవచ= కుమారుని యొక్క, అపత్యం= కుమారుని,పశ్యేత్=చూచుచున్నాఁడో,తదా= అప్పుడు, అరణ్యం = అరణ్యమును, సమాశ్రయేత్=పొందవలయును.

మూ॥ పుత్రేషు దారా న్నిక్షిప్య తయా వానుగతేవనే। అగ్నీను
పచరేన్నిత్యం వన్యమాహార మాహరేత్. ౨

టీక॥దారాన్=భార్యను,పుత్రేషు=కొమారులయందు(కొమారులదగ్గిర) నిక్షిప్య=ఉంచి, వా=లేక, తయా=ఆభార్యతో,అనుగతః=కూడుకొనినవాఁడై, వనే=వనమందు, నిత్యం=ప్రతిదినము,అగ్నీన్=త్రేతాగ్నులను, ఉపచరేత్=పూజించవలయును, వన్యం=వనసంబంధియైన, ఆహారం=ఆహారమును, ఆహరేత్=భక్షించవలయును.

మూ॥యదాహారో భవేత్తేన పూజయే త్పితృదేవతాః।తేనైవ
పూజయెన్నిత్య మతిథిం సము పాగతమ్.౩

టీక॥ యదాహారః=ఏఆహారము కలిగినవాఁడుగా, భవేత్=ఉంటున్నాడో, తేన=ఆయాహారముచేతను,పితృదేవతాః=పితరులను దేవతలను, పూజయేత్=పూజించవలయును తేనఏవ=ఆయాహారముచేతనే,సముపాగతం=

కాలమందువచ్చిన, అతిథిం=అతిథిని, నిత్యం=ప్రతిదినము, పూజయేత్=పూజించవలయును.

మూ॥ గ్రామా దాహృత్య వాశ్నీయా దష్టౌగ్రాసాన్సమాహితః।
స్వాధ్యాయంచ తథా కుర్యా జ్జటాశ్చబిభృయా త్తథా.౪

టీ॥ గ్రామాత్ = గ్రామమునుంచి, ఆహృత్యవా=తీసికొనివచ్చిగాని, సమాహితః = జాగరూకుఁడై, అష్టౌ=ఎనిమిది, గ్రాసాన్=కబళములను, అశ్నీయాత్ = భక్షించవలయును, తథా=అటువలెనే, స్వాధ్యాయంచ= వేదపారాయణమును, కుర్యాత్=చేయవలయును, తథా=అదేప్రకారము, జటాఃచ=జటలను, బిభృయాత్=ధరించవలయును.

మూ॥ తపసా శోషయే న్నిత్యం స్వకం చైవ కళేబరమ్। ఆర్ద్ర
వాసాస్తుహేమంతే గ్రీష్మే పంచతపా స్తథా.౫
ప్రావృష్యా కాశశాయీచ నక్తాశీచ సదాభవేత్।
చతుర్థకాలికో వా స్యాత్షష్ఠకాలిక ఏవవా.౬

టీక॥ నిత్యం=ఎల్లప్పుడు, స్వకంచఏవ=తన. కళేబరం=శరీరమును, తపసా=తపస్సుచేత, శోషయేత్ = శోషింపచేయవలయును, తు=మరియు, హేమంతే = మంచుకాలమందు, ఆర్ద్రవాసాః= తడివస్త్రములుగలవాఁడుగాను, తథా=అటువలెనే, గ్రీష్మే=ఎండకాలమందు, పంచ= పంచాగ్నిమధ్యమున, తపాః=తపించువాఁడుగాను, ప్రావృషి=వర్షాకాలమందు, ఆకాశశాయీచ =నిరావరణప్రదేశమందుపండుకొనిన వాఁడుగాను, భవేత్=కావలయును, సదా=ఎల్లప్పుడు, నక్తాశీచ రాత్రియందెభోజనముచేయువాఁడుగాను, వా= లేక, చతుర్థకాలికః=నాలుగవకాలమందు భోజనము చేయువాఁడుగాను, వా=లేక, షష్ఠకాలికఃఏవ=ఆరవకాలమందుభోజనముచేయువాడుగాను, స్యాత్=కావలయును.

మూ॥ కృచ్ఛై ర్వా పి నయే త్కాలంబ్రహ్మచర్యంచ పాలయేత్।
ఏవం నీత్వా వనేకాలం ద్విజో బ్రహ్మా శ్రమీ భవేత్.౭

టీక॥ కృచ్ఛ్రైః వా అపి = (చాంద్రాయణాది) కృచ్ఛ్రములచేతను

కాలం=ప్రొద్దును , నయేత్=గడపవలయును,బ్రహ్మచర్యం చ =బ్రహ్మచర్య వ్రతమును, పాలయేత్ = కాపాడవలయును, ఏవం=ఈవిధముగా, వనే= వానప్రస్థాశ్రమమందు, కాలం=కాలమును, నీత్వా= గడిపి ద్విజః=ద్విజుఁడు, బ్రహ్మాశ్రమీ = సన్న్యాసాశ్రమముగలవాఁడుగా , భవేత్ = ఉండవలయును.

ఇతిశంఖస్మృతౌ=షష్ఠోధ్యాయః.

టీక ॥ శంఖస్మృతౌ = శంఖస్మృతియందు , షష్ఠః= ఆరవదగు , అధ్యాయః=అధ్యాయము. ఇతి=ముగిసెను.





## అథశంఖస్మృతౌ

### సప్తమాధ్యాయప్రారంభః.

మూ॥ కృత్వేష్టిం విధివ త్పశ్చా త్సర్వవేదసదక్షిణామ్ । ఆత్మ న్యగ్నిం సమారోప్య ద్విజో బ్రహ్మాశ్రమీ భవేత్. ౧

టీక॥ ద్విజః=ద్విజుఁడు, విధివత్ = శాస్త్రప్రకారము, సర్వవేదసదక్షిణాం=సర్వస్వముదక్షిణగాగల, ఇష్టిం=ఇష్టిని, కృత్వా=చేసి, పశ్చాత్= అనంతరమందు, అగ్నిం=అగ్నిని, ఆత్మని=తనయందు, సమారోప్య=ఆవాహనముచేసికొని, బ్రహ్మాశ్రమీ=సన్న్యాసాశ్రమముగలవాఁడుగా, భవేత్= కావలయును.

మూ॥ విధూమే న్యస్తముసలే వ్యంగారే భుక్తవర్జనే । అతీత పాదసంపాతే నిత్యం భిక్షాం యతి శ్చరేత్. ౨

టీక॥ విధూమే = (గృహములలో) పొగలేని కాలమందు, న్యస్తముసలే=రోకలివ్యాపారము అణిగినప్పుడు, వ్యంగారే = నిప్పులేనికాలమందు, భుక్తవర్జనే = భోజనముచేయకఉండిన కాలమందు, అతీతపాదసంపాతే=పాదసంచారములేనికాలమందు, యతిః=సన్న్యాసి, నిత్యం=ప్రతిదినము, భిక్షాం=భిక్షాగ్రహణమును, చరేత్= చేయవలయును.

మూ॥ సప్తాగారాం శ్చరే ద్భైక్షం భిక్షితం నానుభిక్షయేత్ । నవ్యథేత తథాఽలాభే యథాలబ్ధేన వర్తయేత్. ౩

టీక॥ సప్తాగారాన్ = ఏడుగృహములలో, భైక్షం = భిక్షాగ్రహణమును, చరేత్ = చేయవలయును, భిక్షితం= (మరియొకడు) భిక్షతీసికొనిన అన్నమును, న అనుభిక్షయేత్ = యాచించరాదు, తథా=అటువలెనే, అ

లాభే =( చాలినంత ) లభించనిచో డల , నవ్యథేత = వ్యసనపడకూడదు , యథాలబ్ధేన = దొరికినదానిచేత , వర్తయేత్ = జీవనము చేయవలయును.

మూ॥ నపాచయేత్తథైవాన్నం నాశ్నీయాత్కస్యచిద్గృహే ।
మృన్మయాలాబుపాత్రాణి యతీనాంచ వినిర్దిశేత్. ౮

టీ॥ అన్నం=అన్నమును,నపాచయేత్=(సన్న్యాసి) వండుకోకూడదు, తథాఏవ = అటువలెనే,కస్యచిత్ = ఒకనియొక్క, గృహే= ఇంటిలో, న అశ్నీయాత్ =భోజనముచేయకూడదు,యతీనాంచ=సన్న్యాసులకు,మృన్మయాలాబుపాత్రాణి= మంటిపాత్రము సొరకాయపాత్రము, వినిర్దిశేత్ =ఇయ్యవలయును.

మూ॥ తేషాం సంమార్జనాచ్ఛుద్ధిరద్భిశ్చైవప్రకీర్తితా।కౌపీ
నం చ్ఛాదనం వాసో బిభృయాదసఖశ్చరన్. ౯
శూన్యాగారనికేతస్స్యాద్యత్రసాయంగృహోమునిః.

టీక॥ తేషాం=వాటికి (ఆపాత్రములకు),అద్భిఃచఏవ= ఉదకములచేత, సంమార్జనాత్ =ప్రోక్షణమువలన, శుద్ధిః=పవిత్రత, ప్రకీర్తితా = చెప్పబడియున్నది, కౌపీనం= గోచిని, చ్ఛాదనంవాసః= కప్పుకొనువస్త్రమును, బిభృయాత్ =ధరించవలయును, అసఖః= (పగలు) సఖుఁడులేక,చరన్=సంచరించుచు,శూన్యాగారనికేతః=(రాత్రి) కాపురములేనియిల్లునివాసస్థానముగలవాఁడుగా,స్యాత్ =కావలయును, సాయంగృహః= సాయంకాలమందు(మాత్రమె)ఇల్లుగల, మునిః=ఋషి, యత్ర= ఎచ్చట (ఉంటున్నాడో అదిపుణ్యదేశము.)

మూ॥ దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్ ।
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్. ౧౦

టీక ॥ దృష్టిపూతం = చూపుచేత పవిత్రముగా నుండెడి (స్థలమందు పాదం= పాదమును, న్యసేత్ = ఉంచవలయును. వస్త్రపూతం = వడిగట్టిన, జలం=ఉదకమును, పిబేత్= త్రాగవలయును,సత్యపూతాం = సత్య

ముచేతపరిశుద్ధమైన,వాచం = వచనమును, వదేత్= పలుకవలయును,మనః పూతం= మనస్సుచే పవిత్రమైన దానిని, సమాచరేత్ = చేయవలయును.

మూ॥ సర్వభూతసమో మైత్ర స్సమలోష్టాశ్మకాంచనః। ధ్యాన యోగరతో భిక్షుః ప్రాప్నోతి పరమాం గతిమ్॥ ౬

టీక॥ సర్వభూతసమః= సర్వభూతములందుసమానబుద్ధిగలిగి, మైత్రః= స్నేహభావముగల్గి , సమలోష్టాశ్మకాంచనః= మంటిగడ్డ రాయి బంగార ముసమానముగానెంచుచు,ధ్యానయోగరతః=ధ్యానయోగమందుఆసక్తిగ ల, భిక్షుః=సన్న్యాసి, పరమాం=ఉత్తమమైన,గతిం=గతిని,ప్రాప్నోతి= పొందుచున్నాఁడు.

మూ॥ చందనై ర్లిప్యతేంగంవా భస్మచూర్ణై ర్విగర్హితైః । కళ్యాణ మప్య కళ్యాణం తయో రేవ న సంశ్రయేత్॥ ౭

టీక॥ అంగం=శరీరమును, చందనైః=సుగంధద్రవ్యములచేతను, లిప్యతే వా=పూయబడినను, విగర్హితైః=నిందితములైన, భస్మచూర్ణైః= బూ డిదె మొదలైనవానిచేతఁ బూయబడినను, కల్యాణం= (దానివలనకలిగె) శుభము,అకల్యాణం అపి= అశుభమును, తయోఃఏవ=వారలకే (పూసిన వారికె) నసంశ్రయేత్=(యతిని) అంటదు.

మూ॥ జన్మనా యస్తు నిర్విణ్ణో మరణేన తథైవచ। ఆధిభి ర్వ్యాధి భిశ్చైవ తం దేవా బ్రాహ్మణం విదుః॥ ౮

టీక॥ యః తు=ఎవఁడు (ఏసన్న్యాసి),ఆధిభిః=మనోవ్యాధులచేతను, వ్యాధిభిః=శరీరవ్యాధులచేతను, ఇవ= (విసుకుపడ్డట్టు) వలెనే, జన్మనా= జననముచేతను, తథాఏవచ=అటువలెనే, మరణేన=మరణముచేతను, నిర్వి ణ్ణః=విసుకుపడుచున్నాడో, తం = వానిని, దేవాః=దేవతలు , బ్రాహ్మ ణం = బ్రాహ్మణునిగా, విదుః=తెలిసికొను చున్నారు.

మూ॥అశుచిత్వం శరీరస్య ప్రియస్య చ విపర్యయః । గర్భవాసే చ వసతి స్తస్మా న్ముచ్యేత నాన్యథా॥ ౧౦

టీక॥ తస్మాత్=అందువలన (జననమరణ నిర్వేదమువల్ల) శరీరస్య= శరీరముయొక్క, అశుచిత్వం=అశుచిభావము, ప్రియస్యచ = ఇష్టముగాయొక్క, విపర్యయః=వ్యత్యాసము, గర్భవాసేచ=గర్భవాసమందు, వసతిః=వాసము, ముచ్యేత=విడువబడును, అన్యథా= వేరుకారణముచేత, న=విడువబడదు.

మూ॥జగ దేత న్నిరాక్రందం నతు సార మనర్థకమ్। భోక్తవ్య మితి నిర్విణ్ణో ముచ్యతే నాత్ర సంశయః॥ ౧౧

టీక॥ నిరాక్రందం=రక్షకుడులేని, అనర్థకం = ప్రయోజనములేని, ఏతత్=ఈ, జగత్=ప్రపంచము, నతుసారం=సారమైనదికాదు, భోక్తవ్యం ఇతి= (అయినను) అనుభవించితీరవలయునని, నిర్విణ్ణః=విసుగుపొందినవాడు, ముచ్యతే = (బంధములోనుంచి) విడువబడును, అత్ర= ఈవిషయమందు, నసంశయః=సంశయములేదు.

మూ॥ ప్రాణాయామై ర్దహే ద్దోషా న్ధారణాభిశ్చ కిల్బిషమ్ । ప్రత్యాహారై రసత్సంగా న్ధ్యానేనా నీశ్వరా న్గుణాన్. ౧౨

టీక॥ ప్రాణాయామైః=ప్రాణాయామయోగములచేత, దోషాన్= (దేహ) దోషములను,ధారణాభిః=ధారణాయోగములచేత, కిల్బిషంచ= పాపమును. ప్రత్యాహారైః= ప్రత్యాహారయోగములచేతను, అసత్సంగాన్ = చర్మవిషయసంబంధములను, ధ్యానేన=ధ్యానయోగముచేత, అనీశ్వరాన్గుణాన్=జీవధర్మములను, దహేత్=పోగొట్టవలెను,

మూ॥సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసాసహ। త్రిః పఠే దాయతప్రాణః ప్రాణాయామ స్స ఉచ్యతే. ౧౩

టీక॥ సవ్యాహృతిం (ద్విజుడు)= వ్యాహృతిమంత్రములతోచేరిన, సప్రణవాం=ప్రణవముతోచేరిన, గాయత్రీం=గాయత్రిని, శిరసాసహ = శిరోమంత్రముతో, ఆయతప్రాణః=కట్టబడిన శ్వాసము గలవాడై, త్రిః= మూడుమాలులు, పఠేత్=పఠించవలయును, సః=అది,ప్రాణాయామః=

ప్రాణాయామయోగమని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

మూ॥ మనస స్సంయమ స్తజ్ఞై ర్ధారణేతి నిగద్యతే । సంహారశ్చేంద్రియాణాంచ ప్రత్యాహారః ప్రకీర్తితః. ౧౪

టీక॥ మనసః=మనస్సుయొక్క, సంయమః= నిలపడము, ధారణాఇతి=ధారణాయోగమని, తద్జ్ఞైః=యోగశాస్త్రము తెలిసినవారిచేత, నిగద్యతే=చెప్పబడుచున్నది, చ = మరియు, ఇంద్రియాణాంచ=ఇంద్రియములయొక్క, సంహారః=ఉపసంహారము, ప్రత్యాహారః= ప్రత్యాహారయోగమని, ప్రకీర్తితః=చెప్పబడియున్నది.

మూ॥ హృదయస్థస్య యోగేన దేవదేవస్య దర్శనమ్ । ధ్యానం ప్రోక్తం ప్రవక్ష్యామి ధ్యానయోగ మతః పరమ్॥ ౧౫

టీక॥ యోగేన=యోగముచేతను, హృదయస్థస్య=హృదయమందుండెడు, దేవదేవస్య = పరమాత్మునియొక్క , దర్శనం = దర్శించుట, ధ్యానం=ధ్యానయోగమని, ప్రోక్తం=చెప్పబడియున్నది, అతఃపరం=ఇందుమీదట, ధ్యానయోగం=ధ్యానయోగమును, ప్రవక్ష్యామి= (విశేషించి)చెప్పుచున్నాను.

మూ॥ హృదిస్థా దేవతా స్సర్వా హృది ప్రాణాః ప్రతిష్ఠితాః। హృది జ్యోతీంషి సూర్యశ్చ హృది సర్వం ప్రతిష్ఠితమ్. ౧౬

టీక॥ సర్వాః=అందరు, దేవతాః=దేవతలు , హృదిస్థాః = హృదయమందుండెడువారు, ప్రాణాః=ప్రాణములు , హృది=హృదయమందు, ప్రతిష్ఠితాః=ఉంటున్నవి, జ్యోతీంషి=తేజస్సులు, సూర్యశ్చ=సూర్యుడును, హృది=హృదయమందు, (ఉంటున్నారు) హృది=హృదయమందు , సర్వం=అన్నియు, ప్రతిష్ఠితం=ఉంటున్నది.

మూ॥ స్వదేహ మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ధ్యాననిర్మథనాభ్యాసా ద్విష్ణుం పశ్యే ద్ధృది స్థితమ్. ౧౭

టీక॥ స్వదేహం = తనదేహమును, అరణిం = (క్రిందనుండే) అరణిగా యొయ్యవత్తుగాను, ప్రణవంచ = ప్రణవమును, ఉత్తరారణిం = పైనఉండేఅరణి గొయ్యవత్తుగాను, కృత్వా = చేసి, ధ్యాననిమథనాభ్యాసాత్ = ధ్యానమనె త్రచ్చుటయొక్క అభ్యాసమువలన, హృదిస్థితం = హృదయమందుండెడి, విష్ణుం = విష్ణువును, పశ్యేత్ = చూడవలయును.

మూ॥ హృద్యర్కశ్చంద్రమా స్సూర్య సోమమధ్యే హుతాశనః।
తేజోమధ్యే స్థితం సత్వం సత్వమధ్యే స్థితో చ్యుతః, ౧౭

టీ॥ హృది, హృదయమందు, అర్కః = సూర్యుడు, చంద్రమాః = చంద్రుడు, సూర్యసోమమధ్యే = (ఈ) సూర్యచంద్రులనడుమ, హుతాశనః = అగ్ని, (ఉంటున్నాడు) తేజోమధ్యే = (ఆ) అగ్నియొక్కనడుమ, సత్వం = మనస్సు, స్థితం = ఉంటున్నది, సత్వమధ్యే = మనస్సుయొక్కనడుమ, అచ్యుతః = విష్ణువు, స్థితః = ఉంటున్నాడు.

మూ॥ అణో రణీయా న్మహతో మహీయా నాత్మాస్య జంతో
ర్నిహితో గుహాయామ్। తేజోమయం పశ్యతి వీతశోకో ధా
తుః ప్రసాదా న్మహిమాన మాత్మనః. ౧౮

టీక॥ అణోః = సూక్ష్మమైనపరమాణువునకంటె, అణీయాన్ = సూక్ష్మమైన, మహతః = వ్యాపకమైన, ఆకాశమునకంటె, మహీయాన్ = వ్యాపకమైన, ఆత్మా = పరమాత్మ, అస్య = ఈ, జంతోః = ప్రాణియొక్క, గుహాయాం = (బుద్ధిఅనె) గుహయందు, నిహితః = ఉంచబడియున్నాడు, వీతశోకః = (రాగాది) శోకములులేనివాడు, ధాతుః = బ్రహ్మయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, ఆత్మనః = తనయొక్క, మహిమానం = మహిమరూపకమైన, తేజోమయం = జ్ఞానప్రకాశ రూపుడైనవాని, పశ్యతి = చూచుచున్నాడు.

మూ॥ వాసుదేవ స్తమోంధానాం ప్రత్యక్షో నైవజాయతే ।
అజ్ఞానపటసంవీతై రింద్రియై ర్వివృమైషిభిః. ౨౦

టీక॥ వాసుదేవః = విష్ణువు, తమోంధానాం = అజ్ఞానముచేతఅంధులై

నవారికి, అజ్ఞానపటసంవీతైః = అజ్ఞానమనేవస్త్రముచేతకప్పబడిన , విషయైషిభిః=శబ్దాదివిషయములందుస్పృహగల, ఇంద్రియైః=మనస్సు మొదలైన ఇంద్రియములచేతను, ప్రత్యక్షః=ప్రత్యక్షవిషయుఁడుగా,నజాయతేఏవ=కానేకాడు.

మూ॥ ఏష వై పురుషో విష్ణు ర్వ్యక్తావ్యక్త స్సనాతనః । ఏష
ధాతా విధాతాచ పురాణో నిష్కళ శ్శివః. ౨౧

టీక॥ ఏషఃవై = వీఁడే , పురుషః = పురుషుఁడు , విష్ణుః=విష్ణువు ,వ్యక్తావ్యక్తః=వ్యక్తఅవ్యక్తఉభయరూపుఁడు ,సనాతనః=ఎల్లప్పుడునుండువాడు, ఏషః=వీఁడే, ధాతా=బ్రహ్మ,విధాతాచ=ధారకుఁడును,పురాణః=అన్నిటికన్నముందుండినవాఁడు , నిష్కలః=అవయవములులేనివాడు,శివః = శివుఁడు.

మూ॥ వేదా హ మేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమ
సః పరస్తాత్। యం వై విదిత్వా నబిభేతి మృత్యో ర్నాన్యః పం
థా విద్యతేఽ యనాయ. ౨౨

టీక॥ యంవై =ఏపురుషుని, విదిత్వా=తెలిసికొని, మృత్యోః=మరణమువలన,నబిభేతి=భయపడడో, ఏతం=ఇట్టి, తమసః=అజ్ఞానమనుచీకటికంటె, పరస్తాత్=అవలనుండెడు,ఆదిత్యవర్ణం=సూర్యప్రకాశముగల,మహాంతం=వ్యాపకుఁడైన,పురుషం=పురుషుని, అహం=నేను(అని,)వేద=తెలిసికొనుచున్నాఁడో,అయనాయ=మోక్షముకొరకు,అన్యః=(దానికన్నను)వేరైన,పంథాః=త్రోవ,న=లేదు.

మూ॥పృథి వ్యాప స్త థా తేజో వాయు రాకాశ మేవచ।పంచై
తాని విజానీయా న్మహా భూతాని పండితః. ౨౩

టీక॥ పృథివీ=భూమి, ఆపః= ఉదకము , తథా=అటువలెనే, తేజః=తేజస్సు, వాయుః=వాయువు, ఆకాశంఏవచ=ఆకాశము, ఏతాని=ఈ,పంచ=అయిదు , మహాభూతాని = మహాభూతములని, పండితః=పండితుఁడు, విజానీయాత్=తెలిసికొనవలయును.

మూ॥ చక్షుశ్శ్రోత్రం స్పర్శనంచరసనం ఘ్రాణమేవచ।
బుద్ధీంద్రియాణి జానీయా త్పంచైతాని శరీరకే. ౨౨

టీక॥ శరీరకే=శరీరమందు, చక్షుః=కన్ను, శ్రోత్రం=చెవి, స్పర్శనం=చర్మము, రసనంచ=నాలికె, ఘ్రాణంఏవచ=ముక్కు, ఇమాని=ఈ, పంచ=అయిదు, బుద్ధీంద్రియాణి=జ్ఞానేంద్రియములు(అని)జానీయాత్=తెలియవలయును.

మూ॥ రూపం శబ్ద స్తథా స్పర్శోరసౌ గంధ స్తథైవచ।
ఇంద్రియార్థాన్విజానీయా త్పంచైవ విషయాన్బుధః. ౨౩

టీక॥ రూపం=రూపము, శబ్దః=శబ్దము, తథా=అటువలెనే, స్పర్శః=స్పర్శము, రసః=రుచి, తథాఏవచ=అటువలెనే, గంధః=వాసన, పంచ ఎవ=(ఈ)అయిదును, ఇంద్రియార్థాన్=ఇంద్రియప్రయోజనములైన, విషయాన్=విషయములుగా, బుధః=తెలిసినవాడు, విజానీయాత్=తెలిసికొనవలయును.

మూ॥ హస్తౌ పాదావుపస్థంచ జిహ్వాపాయు స్తథైవచ।
కర్మేంద్రియాణి పంచైవ నిత్య మస్మిన్శరీరకే. ౨౪

టీక॥ అస్మిన్=ఈ, శరీరకే=శరీరమందు, హస్తౌ=చేతులు, పాదౌ=పాదములు, ఉపస్థంచ=ఉపస్థము, జిహ్వా=వాక్కు, తథాఏవచ=అటువలెనే, పాయుః=గుదము, పంచఏవ=(ఈ) అయిదును, నిత్యం= ఎల్లప్పుడు, కర్మేంద్రియాణి=క్రియాసాధకఇంద్రియములు.

మూ॥ మనోబుద్ధీ స్తథైవాత్మా హ్యవ్యక్తం చ తథైవచ।
ఇంద్రియేభ్యః పరాణీహ చత్వారి కథితాని చ. ౨౫

టీక॥ ఇహ=(ఈ)దేహమందు, మనః=మనస్సు, (సంశయాత్మకమైనది) బుద్ధిః=బుద్ధి, (నిశ్చయరూపమైనది,)తథాఏవ = అటువలెనే, ఆత్మాహి=అహంకారము(నేననుట,)తథాఏవచ=అటువలెనే, అవ్యక్తంచ=మూలప్రకృతి, చత్వారి=నాలుగు, ఇంద్రియేభ్యః= ఇంద్రియములకంటె, పరాణి=పైబడినవిగా, కథితానిచ=చెప్పబడియున్నవి.

మూ॥ తథాత్మానంతద్వ్యతీతఃపురుషం పంచవింశకమ్ ।
తంతు జ్ఞాత్వా విముచ్యంతే తేజనాస్సాధు వృత్తయః. ౨౬

టీక॥ తథా=అటువలెనే, తద్వ్యతీతం=పూర్వోక్త తత్వములకంటె వేఱుగానుండెడు, ఆత్మానం=జీవుడనే పేరుగల, పురుషం=పరమాత్మను, పంచవింశకం=ఇరువదిఅయిదోవానిగా(తెలిసికోవలయును) తంతు = ఆపరమాత్మను, జ్ఞాత్వా=తెలిసికొని, విముచ్యంతె = ముక్తినిపొందుచున్నారు, తేజనాః=అటులతెలిసికొనినజనులు, సాధువృత్తయః= మంచిస్థితిగలవారు.

మూ॥ తదిదంపరమం గుహ్య మెతదక్షర ముత్తమమ్ ।
అశబ్దరస మస్పర్శ మరూపం గంధ వర్జితమ్ ।
నిర్దుఃఖ మసుఖం శుద్ధం తద్విష్ణోః పరమం పదమ్. ౨౭

టీక॥ తత్=ఆ (పూర్వోక్తమైన), ఇదం=ఇది (పురుషస్వరూపము), పరమం=మిక్కిలి, గుహ్యం=రహస్యమైనది, ఏతత్=ఇది, అక్షరం=నాశరహితమైనది, ఉత్తమం=శ్రేష్ఠమైనది, అశబ్దరసం= శబ్దము, రసము లేనిది, అస్పర్శం=(శీతోష్ణ) స్పర్శనములులేనిది, అరూపం= రూపములేనిది, గంధవర్జితం=వాసన లేనిది, నిర్దుఃఖం = దుఃఖములేనిది, అసుఖం=సుఖములేనిది, శుద్ధం=శుద్ధమైనది, తత్=అది, విష్ణోః=సర్వవ్యాపియైనపరమాత్మయొక్క, పరమం = శ్రేష్ఠమైన, పదం=స్థానము

మూ॥ అజం నిరంజనం శాంత మవ్యక్తం ధ్రువమక్షరమ్ ।
అనాదినిధనం బ్రహ్మ తద్విష్ణోః పరమంపదమ్. ౨౮

టీక॥ తత్=ఆ, బ్రహ్మ=సర్వవ్యాపకమైన, విష్ణోః= విష్ణువుయొక్క, పరమం=శ్రేష్ఠమైన, పదం=వస్తువు (స్వరూపము), అజం=జననములేనిది, నిరంజనం=మెప్పులేనిది, శాంతం= శాంతమైనది, అవ్యక్తం = వ్యక్తముగానిది, ధ్రువం=స్థిరమైనది, అక్షరం =నాశరహితమైనది, అనాదినిధన =ఆద్యంతములులేనిది.

మూ॥ విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహాబంధనః ।
సోధ్వనః పరమాప్నోతి తద్విష్ణోః పరమంపదమ్. ౨౯

టీక॥ యఃతు=ఎవడు, విజ్ఞానసారథిః=బుద్ధియేసారథి గాఁగలవాఁడో, మనః ప్రగ్రహాబంధనః = మనస్సనెడుపగ్గమును బంధించువాఁడో. సః=వాఁడు, అధ్వనః=(ధ్యానయోగ) మార్గమునకు, పరం=కొనగానుండెడు, తత్=ఆ, విష్ణోః=విష్ణువుయొక్క, పరమం=శ్రేష్ఠమైన, పదం=స్వరూపమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు.

మూ॥ వాలాగ్రశతభాగస్తు కల్పితశ్చైత్సహస్రధా ।

తస్యభాగా చ్ఛతతమాజ్జీవస్సూక్ష్మఉదాహృతః. ౩౦

టీక॥ వాలాగ్రశతభాగఃతు=వెండ్రుకకొనయొక్క నూరవభాగము, సహస్రధా=వెయ్యిగా, కల్పితఃచేత్=చేయబడితే, తస్య=దానియొక్క, (ఆ వెయ్యోభాగముయొక్క) శతతమాత్=నూరవ, భాగాత్= భాగముకంటె, సూక్ష్మః=సూక్ష్మముగా, జీవః=జీవుడు, ఉదాహృతః = చెప్పబడుచున్నాఁడు.

మూ॥ ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।

మనసస్తు పరా బుద్ధి బుద్ధేరాత్మా మహాన్పరః. ౩౧

టీక॥ ఇంద్రియేభ్యః=ఇంద్రియములకంటె, అర్థాః=విషయములు, పరాఃహి=పైబడినవి, అర్థేభ్యఃచ= విషయములకంటె, మనః=మనస్సు, పరం=పైబడినది, మనసఃతు=మనస్సుకంటె, బుద్ధిః=బుద్ధి, పరా=పైబడినది, బుద్ధేః=బుద్ధికంటె, మహాన్ ఆత్మా=అహంకారాత్మ, పరః=పైబడినది.

మూ॥ మహతః పరమ వ్యక్త మవ్యక్తా త్పురుషః పరః ।

పురుషా న్నపరం కించి త్సాకాష్ఠా సాపరా గతిః. ౩౨

టీక॥ మహతః = అహంకారాత్మకంటె, అవ్యక్తం=మూలప్రకృతి, పరం=పైబడినది, అవ్యక్తాత్ = మూలప్రకృతికంటె, పురుషః = పరమాత్మ, పరః=పైబడినది, పురుషాత్=పరమాత్మకంటె, పరం=పైబడినది, కించిత్ = ఏదిన్ని, న=లేదు, సా = అదే , కాష్ఠా=కొన, సా = అదే , పరా=కడపటి, గతిః=ప్రాప్యస్థానము.

మూ॥ ఏవ సర్వేషు భూతేషు తిష్ఠత్యవికలస్సదా। దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మబుద్ధిభిః. ౩౩

టీక॥ ఏషః=వీడు(పరమాత్మ)సర్వేషు భూతేషు= అన్నిభూతములయందు, సదా=ఎల్లప్పుడు, అవికలః=మారనివాఁడై, తిష్ఠతి=ఉంటున్నాఁడు, సూక్ష్మబుద్ధిభిః=సూక్ష్మబుద్ధిగలవారిచేత, అగ్ర్యయా=ఏకాగ్రమైన, సూక్ష్మయా=సూక్ష్మమైన, బుద్ధ్యాతు=బుద్ధిచేత, దృశ్యతే=చూడబడుచున్నది.

ఇతి శ్రీశంఖస్మృతౌ—సప్తమోఽధ్యాయః.

టీక॥ శ్రీశంఖస్మృతౌ=శంఖస్మృతియందు, సప్తమః=ఏడవదగు, అధ్యాయః=అధ్యాయము, ఇతి=ముగిసెను.







శ్రీ

అథశంఖస్మృతౌ

అష్టమాధ్యాయప్రారంభః.

మూ॥ నిత్యం నైమిత్తికం కామ్యం, క్రియాంగం మలకర్షణమ్।
క్రియాస్నానం తథా షష్ఠం, షోఢాస్నానం ప్రకీర్తితమ్. ౧

టీక॥ స్నానం=స్నానము, నిత్యం=నిత్యమనియు, నైమిత్తికం= నైమిత్తికమనియు, కామ్యం=కామ్యమనియు, క్రియాంగం=క్రియాంగమనియు, మలకర్షణం=మలకర్షణమనియు, తథా=అటువలెనె, షష్ఠం= ఆరవదియయిన, క్రియాస్నానం=క్రియాస్నానమనియు, షోఢా=ఆరువిధములుగలదిగా, ప్రకీర్తితం = చెప్పఁబడియున్నది.

మూ॥ అస్నాత స్స్యాన్నరో౽నర్హో జప్యాగ్నిహవనాదిషు।
ప్రాతస్స్నానం తదర్థంచ నిత్యస్నానం ప్రకీర్తితమ్॥ ౨

టీక॥ అస్నాతః=స్నానముచేయని, నరః=పురుషుఁడు, జప్యాగ్నిహవనాదిషు=జపము అగ్నికర్మము మొదలైన వానియందు, అనర్హః= అనర్హుఁడు, స్యాత్=అగుచున్నాఁడు, తదర్థంచ = అయోగ్యతార్థమైన, ప్రాతస్స్నానం=ప్రాతస్స్నానము, నిత్యస్నానం=నిత్యస్నానమని, ప్రకీర్తితం=చెప్పఁబడుచున్నది

మూ॥ చండాలశవ యూపాద్యం, స్పృష్ట్వాస్నాతాం రజస్వలామ్।
తేనానర్హస్తు యత్స్నాతి, స్నానం నైమిత్తికం చ తత్. 3

టీక॥ చండాలశవయూపాద్యం=చండాలులను, శవమును=యూపస్తంభము మొదలైనదానిని, అస్నాతాం=స్నానము చేయని, రజస్వలాం=బహిష్ఠి స్త్రీని, స్పృష్ట్వా=తాకి, తేన=ఆస్పర్శముచేత, అనర్హంచ = అయోగ్యతకలిగినవాఁడు, యత్ స్నాతి = ఏస్నానము చేయుచున్నాడో, తత్= అది(ఆస్నానము) నైమిత్తికం=నైమిత్తికమైన, స్నానంచ=స్నానము (అని చెప్పఁబడియున్నది)

మూ॥ పుష్యస్నానాదికం స్నానం దైవజ్ఞ విధిచోదితమ్। తద్ధికామ్యం సముద్దిష్టం నాకామ స్తత్ప్రయోజయేత్. ४

టీక॥ దైవజ్ఞ విధిచోదితం=జ్యోతిశ్శాస్త్రముచేతవిధింపబడిన, పుష్యస్నానాదికం=పుష్యమాసస్నానము మొదలైన, స్నానం=స్నానము(ఏదిగలదో) తత్ హి=అది, కామ్యం=కామ్యస్నానముగా, సముద్దిష్టం=చెప్పబడియున్నది, అకామః=ఫలముకోరనివాఁడు, తత్=ఆస్నానమును, నప్రయోజయేత్ = చేయవలసినదిలేదు.

మూ॥ జప్తుకామః పవిత్రాణి అర్చిష్యన్ దేవతాః పితౄన్।
స్నానం సమాచరేద్యత్తు క్రియాంగం తత్ప్రకీర్తితమ్. ५

టీక॥ పవిత్రాణి=పావనమంత్రములను, జప్తుకామః= జపముచేయనిచ్ఛగలవాఁడు, దేవతాః=దేవతలను, పితౄన్=పితృదేవతలను, అర్చిష్యన్=

పూజచేయబోవు వాఁడు, యత్ తు=ఏస్నానమును, సమాచరేత్ =చేయు చున్నాడో, తత్=అది, క్రియాంగంస్నానం=కర్మాంగస్నానమని. ప్రకీర్తి తం=చెప్పఁబడియున్నది.

మూ॥ మలాపకర్షణార్థాయ, త్స్నాన మభ్యంగ పూర్వకమ్।
మలాపకర్షణార్థాయ, ప్రవృత్తి స్తస్య నాన్యథా.

టీక॥ మలాపకర్షణార్థం=మురికిపోవుటకొరకు, అభ్యంగ పూర్వకం=తైలాభ్యంజనముముందుగాగల, యత్ స్నానం=ఏస్నానముగలదో, తస్య=ఆస్నానమునకు, మలాపకర్షణార్థాయ=మురికిపోవుటకొరకె, ప్రవృత్తిః=ఉపయోగము, నఅన్యథా = వేరేకాదు.

మూ॥ సరిత్సు దేవఖాతేషు, తీర్థేషు చనదీషుచ।
క్రియాస్నానంసముద్దిష్టం, స్నానం సైవ మహాక్రియా.౬

టీక॥ సరిత్సు=ప్రవహించుజలములయందు, దేవఖాతేషు=దేవఖాతము లైన, తీర్థేషుచ=తీర్థములయందు, నదీషుచ=(గంగాది)నదులయందు, స్నానం=స్నానము, క్రియాస్నానం=క్రియాస్నానమని, సముద్దిష్టం=చెప్పబడి యున్నది, సాఏవ=అదె, మహాక్రియా=మహాకర్మస్నానము.

మూ॥ తీర్థాభావేతు కర్తవ్య ముష్ణోదకపరోదకైః।స్నానం తు వహ్నితప్తేన తథైవ పరవారిణా। శరీరశుద్ధి ర్విజ్ఞేయా నతుస్నానఫలంభవేత్।అద్భి గాత్రాణి శుధ్యంతి తీర్థస్నానా త్ఫలంభవేత్.౮

టీక॥ తీర్థాభావేతు=(పుణ్య) తీర్థములేనియెడల, స్నానం=స్నానము, ఉష్ణోదకపరోదకైః= ఉష్ణోదకముచేతను ఇతరులచేతత్రవ్వబడినకూపాదిజలములచేతను, కర్తవ్యం=చేయవలయును, వహ్నితప్తేన= ఉష్ణోదకముచేతను, తథాఏవ=అటువలెనే, పరవారిణా=ఇతరులచేత త్రవ్వబడిన కూపాదిజలములచేతను, శరీరశుద్ధిః=శరీరమునకు శుద్ధి, విజ్ఞేయా=(కలుగున ని)తెలియతగినది, స్నానఫలంతు= స్నానఫలమైతైదో, నభవేత్=కలుగదు, అ

ద్భిః=ఉదకములచేత, గాత్రాణి=శరీరములు, శుద్ధ్యంతి= శుద్ధములగుచు న్నవి,తీర్థస్నానాత్ =పుణ్యతీర్థస్నానము వలన, ఫలం = పుణ్యమును,భవేత్ =కలుగును.

మూ॥సరస్సు దేవఖాతేషు, తీర్థేషు చనదీషుచ।
స్నానమేవక్రియాతస్మాత్స్నానాత్పుణ్యఫలంస్మృతమ్.౧౦

టీక॥ సరస్సు=సరస్సులయందు, దేవఖాతేషు=దేవఖాతములైన,తీర్థేషుచ= (పుష్కరిణి మొదలయిన) తీర్థములయందు, నదీషుచ=నదులయందు,స్నానఏవ= (చేయబడె) స్నానమే, క్రియా=కర్మస్నానము , తస్మాత్=ఆ, స్నానాత్=స్నానముచేతను,పుణ్యఫలం=పుణ్యఫలము, స్మృతం=చెప్పబడియున్నది.

మూ॥ తీర్థం ప్రాప్యానుషంగేన స్నానం యది సమాచరేత్।
స్నానజం ఫలమాప్నోతి తీర్థయాత్రా ఫలం నతు.౧౧

టీక॥ అనుషంగేన=కారణాంతరముచేతను, తీర్థం=తీర్థమును, ప్రాప్య=పొంది, స్నానం=స్నానమును, సమాచరేత్ యది = చేసినట్లైతే, స్నానజం=స్నానమువలనకలిగిన, ఫలం = పుణ్యమును,ఆప్నోతి= పొందుచున్నాడు, తీర్థయాత్రాఫలంతు = తీర్థయాత్రవలన కలిగినఫలమును, న=పొందడు.

మూ॥ సర్వతీర్థాని పుణ్యాని పాపఘ్నాని సదానృణామ్।
పరస్పరానపేక్షాణి కథితాని మనీషిభిః. ౧౨

టీక॥పుణ్యాని=పుణ్యములైన, సర్వతీర్థాని=సమస్తతీర్థములు,పరస్పరానపేక్షాణి=ఒకటినొకటి నపేక్షించనివై, నృణాం=జనులకు , సదా=ఎల్లప్పుడు , పాపఘ్నాని=పాపములపోగొట్టునవిగా ,మనీషిభిః=పండితులచేత, కథితాని=చెప్పబడియున్నవి.

మూ॥ సర్వే ప్రస్రవణాః పుణ్యాఃసరాంసిచ శిలోచ్చయాః।
నద్యః పుణ్యా స్తథా సర్వాజాహ్నవీతు విశేషతః. ౧౩

మూ॥ దేవమప్సుషదం వహ్నిం ప్రపద్యే ఘనిషూదనం ।
ఆపః పుణ్యాః పవిత్రాశ్చ ప్రపద్యే శరణం తథా. ౨౧

టీక॥ అఘనిషూదనం = పాపములనుపోగొట్టె, అప్సుషదం = జలమందు వసించెడు, వహ్నిం దేవం = అగ్నిదేవుని, ప్రపద్యే = భజించుచున్నాను, తథా = అటువలెనే, పుణ్యాః = పుణ్యప్రదములైన, పవిత్రాశ్చ = పరిశుద్ధములైన = ఆపః = జలదేవతలను, శరణం = రక్షకముగా, ప్రపద్యే = భజించుచున్నాను.

మూ॥ రుద్రశ్చాగ్నిశ్చ సర్వాశ్చ వరుణశ్చాప ఏవచ ।
శమయంత్వాశు మేపాపం మాం రక్షంతు చసర్వశః. ౨౨

టీక॥ రుద్రశ్చ = రుద్రుడు, అగ్నిశ్చ = అగ్ని, వరుణః = వరుణుడు, సర్వాశ్చ = సకలమైన, ఆపఏవచ = జలదేవతలు, మే = నాయొక్క, పాపం = పాపమును, ఆశు = శీఘ్రముగా, శమయంతు = పోగొట్టుదురుగాక, సర్వశః = అన్నివిధములను = మాం = నన్ను, రక్షంతు = చ, రక్షించుదురుగాక. *

మూ॥ ఇత్యేవముక్త్వా కర్తవ్యం తతస్సంమార్జనం జలైః।
ఆపోహిష్ఠేతి తిసృభి ర్యథావ దనుపూర్వశః. ౨౩

టీక॥ ఇతిఏవం = ఈవిధముగా, ఉక్త్వా = జపించి, తతః = వెనుక, ఆపోహిష్ఠాఇతి = ఆపోహిష్ఠాఅనే, తిసృభిః = మూడుఋక్కులచేతను, అనుపూర్వశః = పాదక్రమముగాను, యథావత్ = శాస్త్రీయముగాను, జలైః = ఉదకములచేతను, సమ్మార్జనం = ప్రోక్షణము, కర్తవ్యం = చేయతగ్గది.

మూ॥ హిరణ్యవర్ణేతి తిస్రః చతస్రో జగతీతిచ ।
శన్నోదేవీతి చతథా శన్న ఆప స్తథైవచ॥
ఇదమాపః ప్రవహతే త్యృచశ్చ సముదీరయేత్. ౨౪

టీక॥ హిరణ్యవర్ణాఇతి = హిరణ్యవర్ణాఅనే, తిస్రః = మూడు, జగతి ఇతిచ = జగతీఅనె, చతస్రః = నాలుగు, ఋచఃచ = ఋక్కులను, తథా = అటువలెనే, శన్నోదేవీఇతిచ = శన్నోదేవీఅనె ఋక్కును, తథాఏవచ = అటువలెనే, శన్నఆపః = శన్నఆపః అనె ఋక్కును, ఇదమాపః ప్రవహాత

ఇతి=ఇదమాపః అనే ఋక్కును, సముదీరయేత్ =ఉచ్చరించవలయును.

మూ॥ ఏతైస్సమ్మార్జనం కృత్వా ఛందఆర్షంచ దేవతాః।అఘ
మర్షణసూక్తస్య సంస్మరేత్ ప్రయత స్సదా. ౨౫

టీక॥ ఏతైః=వీటి(ఋక్కుల)చేతను, సంమార్జనం=మార్జనమును, కృత్వా=చేసికొని, సదా=ఎల్లప్పుడు, ప్రయతః=శుద్ధుడై, అఘమర్షణ సూక్తస్య=అఘమర్షణమనే సూక్తముయొక్క, ఆర్షంచ=ఋషిని, ఛందః=ఛందస్సును, దేవతాః=దేవతలను,సంస్మరేత్ =స్మరించవలయును.

మూ॥ఛంద ఆనుష్టుభం తస్య ఋషిశ్చైవాఘమర్షణః।
దేవతాభావవృత్తస్తు పాపక్షయె ప్రకీర్తితః ॥ ౨౬

టీక॥ తస్య=ఆసూక్తమునకు, ఋషిః చఏవ=ఋషి, అఘమర్షణః=అఘమర్షణుడు, ఛందః=ఛందస్సు, ఆనుష్టుభం=అనుష్టుపు, భావవృత్తఃతు=భావవృత్తః అనే పరమాత్మ, దేవతా=దేవత, పాపక్షయే=పాపనాశమందు, ప్రకీర్తితః=(వినియోగము)చెప్పబడియున్నది.

మూ॥ తతోంభసి నిమగ్నస్తు త్రిః పఠే దఘమర్షణం।
ప్రక్షిపేన్మూర్ధని తథా మహావ్యాహృతిభి ర్జలం. ౨౭

టీక॥ తతః=అనంతరమందు, అంభసి=నీటిలో, నిమగ్నఃతు=మునిగినవాడై,అఘమర్షణం=అఘమర్షణమంత్రమును,త్రిః=మూడుసార్లు,పఠేత్=పఠించవలయును,తథా=అటువలెనే, మహావ్యాహృతిభిః=మహావ్యాహృతి మంత్రములచేతను, జలం=ఉదకమును, మూర్ధని=శిరస్సుయందు, నిక్షిపేత్=ఉంచుకొనవలయును.

మూ॥ యథాశ్వమేధః క్రతురా ట్సర్వపాప ప్రణాశనః ।
తథాఘమర్షణం సూక్తం సర్వపాప ప్రణాశనం. ౨౮

టీక॥ అశ్వమేధః=అశ్వమేధమనే, క్రతురాట్=యాగశ్రేష్ఠము, యథా=ఎటువలె, సర్వపాపప్రణాశనః= అన్నిపాపములనుపోగొట్టేదో, త

ధా=అటువలెనే, అఘమర్షణంసూక్తం=అఘమర్షణసూక్తము, సర్వ పాపప్రణాశనం= అన్ని పాపములనుపోగొట్టేది.

మూ॥ అనేనవిధినా స్నాత్వాసం వీతోధౌత వాససా ।
పరివర్జితవాసాస్తు తీర్థతీర ఉపస్పృశేత్. ౨౯

టీక॥ అనేన=ఇట్టి, విధినా=విధానముచేతను, స్నాత్వా= స్నానము చేసి, పరివర్జితవాసఃతు=విడువబడిన(తడి)వస్త్రముగలవాఁడై, ధౌతవాససా=ఉతికినవస్త్రముచేతను, తీర్థతీరే=నీళ్లగట్టున, ఉపస్పృశేత్=ఆచమనముచేయవలయును.

మూ॥ ఉదకస్యాప్రదానాచ్చ స్నానశాటింన పీడయేత్ ।
అనేన విధినాస్నాత స్తీర్థస్య ఫలమశ్నుతే. ౩౦

టీక॥ ఉదకస్య=(స్నానాంగతర్పణ) జలముయొక్క, అప్రదానాత్ చ=ఇచ్చువరకు, స్నానశాటిం=తడివస్త్రమును, నపీడయేత్=పిండకూడదు, అనేన=ఈ, విధినా=విధానముచేతను, స్నాతః=స్నానముచేసినవాఁడు, తీర్థస్య=పుణ్యతీర్థముయొక్క, ఫలం=ఫలమును, అశ్నుతే=పొందుచున్నాఁడు.

ఇతిశ్రీశంఖస్మృతౌ= నవమోధ్యాయః.
టీక॥ శ్రీశంఖస్మృతౌ= శంఖస్మృతియందు, నవమోధ్యాయః= తొమ్మిదవ,అధ్యాయము,ఇతి=ముగిసెను.





## అథశంఖస్మృతౌ

### దశమాధ్యాయప్రారంభః.

మూ॥ అతఃపరం ప్రవక్ష్యామి శుభామాచమనక్రియాం ।
కాయం కనిష్ఠికామూలే తీర్థముక్తం కరస్యతు. ౧

టీక॥ అతఃపరం=ఇకను , శుభాం=శుభకరమైన , ఆచమనక్రియాం = ఆచమనక్రియను ; ప్రవక్ష్యామి=చెప్పుచున్నాను,కరస్య=హస్తముయొక్క, కనిష్ఠికామూలేతు=చిటికినవేలుఅడుగున,కాయం=కాయమను, తీర్థం=తీర్థము, ఉక్తం=చెప్పబడియున్నది.

మూ॥ అంగుష్ఠమూలేచ తథా ప్రాజాపత్యం విచక్షణైః ।
అంగుళ్యగ్రే స్మృతం దైవంపిత్ర్యం తర్జనిమూలకే. ౨

టీక॥ తథా=అటువలెనే, అంగుష్ఠమూలేచ=బొట్టనవేలుఅడుగున,ప్రాజాపత్యం=బ్రహ్మతీర్థము, అంగుళ్యగ్రే=వేళ్లకొనయందు , దైవం=దేవతీర్థము, తర్జనిమూలకే=తర్జనివేలుఅడుగున, పిత్ర్యం=పితృతీర్థము, స్మృతం=చెప్పబడియున్నది.

మూ॥ ప్రాజాపత్యేన తీర్థేన త్రిఃప్రాశ్నీయా జ్జలం ద్విజః ।
ద్విఃప్రమృజ్య ముఖం పశ్చాదద్భిః ఖానిసముపస్పృశేత్. ౩

టీక॥ ద్విజః=ద్విజుడు, ప్రాజాపత్యేనతీర్థేన=బ్రహ్మతీర్థముచేతను, జలం=ఉదకమును, త్రిః=మూడుసారులు , ప్రాశ్నీయాత్=పుచ్చుకొనవలయును, పశ్చాత్=వెనుక, అద్భిః=ఉదకములచేతను, ముఖం=ముఖమును , ద్విః=రెండుసారులు, ప్రమృజ్య=తుడిచి, ఖాని=(కన్నుమొదలైన)ఇంద్రియములను, సముపస్పృశేత్=తాకవలయును.

మూ॥ హృద్గాభిః పూయతే విప్రః కంఠగాభిశ్చభూమిపః ।
తాలుగాభిస్తథా వైశ్యః శూద్రస్పృష్టాభిరంతతః. ౪

టీక॥ విప్రః=బ్రాహ్మణుఁడు,హృద్గాభిః=హృదయగతము లైన(ఆచమన ఉదకముల చేతను,)భూమిపశ్చ=క్షత్రియుఁడు , కంఠగాభిః=కంఠగతములైన=(ఆచమనఉదకముల చేతను,)తథా=అటువలెనే, వైశ్యః=వైశ్యుఁడు,తాలుగాభిః=దవడ తాకిన(ఆచమనఉదకముల చేతను,)శూద్రః=శూద్రుఁడు,అంతతః=నాలికకొనయందు, స్పృష్టాభిః=సంబంధింపబడిన(ఆచమనఉదకముల చేతను,)పూయతే=పరిశుద్ధుఁడగుచున్నాఁడు.

మూ॥ అంతర్జానుశ్శుచౌ దేశే ప్రాఙ్ముఖస్సుసమాహితః ।
ఉదఙ్ముఖో వా ప్రయతో దిశశ్చానవలోకయన్.
అద్భిస్సముద్ధృతాభిస్తు హీనాభిః ఫేనబుద్బుదైః ।
వహ్నినాచాప్యతప్తాభి రక్షారాభి రుపస్పృశేత్. ౫

టీక॥ శుచౌ=శుద్ధమైన, దేశే=ప్రదేశమందు, అంతర్జానుః=మోకాళ్లకులోబడిన చేతులుకలవాఁడై , ప్రాఙ్ముఖః = తూర్పుముఖముగలవాఁడై , ఉదఙ్ముఖః వా=ఉత్తరముఖము గలవాఁడైగాని, ప్రయత =శుద్ధుఁడై, దిశఃచ=దిక్కులను,అనవలోకయన్=చూడనివాఁడై,సముద్ధృతాభిః తు=బాగుగా యెత్తబడిన , ఫేనబుద్బుదైఃహీనాభిః=నురుగుబుడ్గలులేని,అపిచ=ఇంక, వహ్నినా అతప్తాభిః=నిప్పుచేత కాచబడని , అక్షారాభిః=ఉప్పుకాని , అద్భిః=ఉదకములచేతను, ఉపస్పృశేత్=ఆచమనముచేయవలయును.

మూ॥ తర్జన్యంగుష్ఠయోగేన స్పృశే న్నాసాపుటద్వయం ।
అంగుష్ఠమధ్యా యోగేన స్పృశేన్నేత్ర ద్వయంతతః. ౬

టీక॥ తర్జన్యంగుష్ఠయోగేన= తర్జనీవేలుబొట్టనవేలుచేర్చుకొనుట చేతను, నాసాపుటద్వయం=ముక్కుయొక్క రెండుపక్కలను, స్పృశేత్=(ఉదకముతో)తాకవలయును, తతః=అనంతరము, అంగుష్ఠమధ్యాయోగేన=బొట్టనవ్రేలు మధ్యవ్రేలు చేర్చుకొనుటచేతను , నేత్రద్వయం=రెండుకన్నులను, స్పృశేత్=(ఉదకముతో)తాకవలయును.

మూ॥ అంగుష్ఠానామికాయోగాత్ శ్రవణే సముపస్పృశేత్ ।
కనిష్ఠాంగుష్ఠయోగేన స్పృశేత్స్కంధద్వయం తతః. ౭

టీక॥ అంగుష్ఠానామికాయోగాత్ =బొట్టనవేలుతో పవిత్రపువేలుచే

చూటలన, శ్రవణౌ=చెవులను, సముపస్పృశేత్=(ఉదకముతో) తాకవలయును, తతః=అనంతరము, కనిష్ఠాంగుష్ఠయోగేన=చిటికినవేలు, బొట్టనవేలు జేర్చడముచేతను, సహాంధద్వయం=రెండుభుజములను, స్పృశేత్=(ఉదకముతోటి) తాకవలయును.

మూ॥ సర్వాసామేవయోగేన నాభించ హృదయంతథా।
సంస్పృశేచ్చతథామూర్ధ్ని ఏష ఆచమనే విధిః.౮

టీక॥ సర్వాసాంఏవ=అన్నిప్రేళ్ల యొక్క, యోగేన=చేర్చడముచేతను, నాభించ=బొడ్డును, తథా=అటువలెనే, హృదయం=రొమ్మును, తథా=అటువలెనే, మూర్ధ్నిచ=శిరస్సును, స్పృశేత్=(ఉదకముతో) తాకవలయును, ఏషః=ఇది, ఆచమనే=ఆచమనమందు, విధిః=విధానము.

మూ॥ త్రిః ప్రాశ్నీయాద్యదంభస్తు ప్రీతా స్తేనాస్య దేవతాః ।
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చభవంతీత్యను శుశ్రుమః.౯

టీక॥ అంభః=ఉదకమును, త్రిః=మూడుసారులు, ప్రాశ్నీయాత్=పుచ్చుకొనవలయును, (అనేది)యత్తు=ఏదికలదో, తేన=దానిచేత, అస్య=వీనికి(కర్తయందు) బ్రహ్మ=బ్రహ్మ, విష్ణుశ్చ= విష్ణువు, రుద్రశ్చ=రుద్రుడు, దేవతాః=(పైనచెప్పబడినముగ్గురు) దేవతలు, ప్రీతాః=ప్రీతినిపొందినవారుగా, భవంతిఇతి=అగుచున్నారని, అనుశుశ్రుమః=వేదవృద్ధవ్యవహారమూలముగావినుచున్నాము.

మూ॥ గంగాచ యమునాచైవ ప్రీయేతే పరిమార్జనాత్ ।
నాసత్యదస్రౌప్రీయేతే స్పృష్టేనాసాపుటద్వయే. ౧౦

టీక॥ పరిమార్జనాత్=(ఉదకముతో ముఖమును) తుడుచుటవలన, గంగాచ=గంగానది, యమునాచఏవ=యమునానది, ప్రీయేతే=ప్రీతులగుచున్నవి' నాసాపుటద్వయే=ముక్కులరంధ్రద్వయము, స్పృష్టే=(ఉదకముచేత) స్పృశించబడగా, నాసత్యదస్రౌ=నాసత్యులనేదస్రులనేఆశ్వినీదేవతలు, ప్రీయేతే= ప్రీతులగుచున్నారు.

మూ॥ స్పృష్టేలోచనయుగ్మేతు ప్రీయేతేశశిభాస్కరౌ।

కర్ణాయుగ్మే తథా స్పృష్టే ప్రీయేతే అనిలానలౌ. ౧౧

టీక॥ లోచనయుగ్మే తు=నేత్రద్వయము, స్పృష్టే=(ఉదకముచేత)స్పృశించబడగా, శశిభాస్కరౌ=చంద్రసూర్యులు,ప్రీయేతే=ప్రీతులగుచున్నారు, తథా=అటువలెనే,కర్ణయుగ్మే=చెవులురెండు, స్పృష్టే=(ఉదకముచేత)స్పృశించబడగా, అనిలానలౌ=వాయువుఅగ్నియును,ప్రీయేతే=ప్రీతులగుచున్నారు.

మూ॥ స్కంధయోస్స్పర్శనాదస్య ప్రీయంతేసర్వదేవతాః।
మూర్ధ్నస్సంస్పర్శనాదస్య ప్రీతస్తు పురుషో భవేత్. ౧౨

టీక॥ స్కంధయోః=భుజములయొక్క, స్పర్శనాత్=స్పర్శమువలన, అస్య=వీనియొక్క(కర్తయందు)సర్వదేవతాః=అందరుదేవతలు, ప్రీయంతే=ప్రీతులగుచున్నారు,మూర్ధ్నః=శిరస్సుయొక్క,సంస్పర్శనాత్=సంస్పర్శముచేత, అస్య=వీనికి(కర్తయందు)పురుషః, తు=పరమాత్ముడు,ప్రీతః=ప్రీతుడుగా,భవేత్=అగుచున్నాడు.

మూ॥ వినాయజ్ఞోపవీతేన,తథాముక్తశిఖోద్విజః।
అప్రక్షాళితపాదస్తు ఆచాంతోప్యశుచి ర్భవేత్. ౧౩

టీక॥ద్విజః=ద్విజుడు, యజ్ఞోపవీతేన, వినా=యజ్ఞోపవీతములేకను, తథా=అటువలెనే,ముక్తశిఖః=విడువబడినశిఖగలవాడై,అప్రక్షాళితపాదః, తు=కడగబడనికాళ్లుగలవాడై,ఆచాంతః-అపి=ఆచమనమునుచేసినవాడైనను,అశుచి=శుద్ధిలేనివాడుగానే, భవేత్=ఉండును.

మూ॥ బహిర్జానురుపస్పృశ్య, ఏకహస్తార్పితైర్జలైః।
సోపానహో తథాతిష్ఠన్నైవశుద్ధి మవాప్నుయాత్. ౧౪

టీక॥ బహిఃజానుః=మోకాళ్లకువెలుపలహస్తములుగలవాడై, సోపానహః=పాదుకలువేసికొనినవాడై, తథా=అటువలె, తిష్ఠన్=నిలుచుకొనినవాడై,ఏకహస్తార్పితైః=ఒంటిచేతయివ్వబడిన, జలైః=ఉదకములచేతను, ఉపస్పృశ్య=ఆచమనముచేసి, శుద్ధిం=శుద్ధిని, న,ఏవ, అవాప్నుయాత్=పొందడు.

మూ॥ ఆచమ్య కృత్వాపూర్వోక్తం; తీర్థసమ్మార్జనం ద్విజః ।
ఉపస్పృశేత్తతఃపశ్చా న్మంత్రేణానేన ధర్మతః. ౧౫

టీక॥ ద్విజః=ద్విజుఁడు, ఆచమ్య=ఆచమనముచేసి , పూర్వోక్తం=ముందుచెప్పబడిన, తీర్థసమ్మార్జనం=ఉదకముచేతనింద్రియస్థానస్పర్శము, కృత్వా=చేసి,తతః=పశ్చాత్=అటువెనుక,అనేన=క్రిందచెప్పబోయ్యే,మంత్రేణ=మంత్రముచేత , ధర్మతః=ధర్మార్థము , ఉపస్పృశేత్=జలప్రాశనమునుచేయవలయును.

మూ॥ అంతశ్చరతి భూతేషు , గుహాయాం విశ్వతోముఖః
త్వం యజ్ఞ స్త్వం వషట్కార ఆపోజ్యోతి రసోమృతమ్. ౧౬

టీక॥ భూతేషు= (పరమాత్మ) ప్రాణులయందు, గుహాయాం=బుద్ధిలోపల, అంతః-చరతి=సంచరిస్తున్నాఁడు, త్వం=నీవు , విశ్వతోముఖః=నలుప్రక్కలముఖముకలవాడవు , త్వం=నీవు , యజ్ఞః=యజ్ఞస్వరూపుఁడవు ,వషట్కారః=వషట్ అనేమంత్రస్వరూపుఁడవు , ఆపః=జలస్వరూపుఁడవు,జ్యోతిః=ప్రకాశస్వరూపుఁడవు,రసః=ఆనందస్వరూపుఁడవు, అమృతం=నాశరహితుఁడవు.

మూ॥ఆచమ్యచ తతఃపశ్చా దాదిత్యాభి ముఖో జలమ్।ఉదుత్యం
జాతవేదస మితి మంత్రేణ నిక్షిపేత్. ౧౭

టీక॥ ఆచమ్యచ=(పైనచెప్పినమంత్రములతోటి) ఆచమనముచేసి తతః పశ్చాత్=అటువెనుక , ఆదిత్యాభిముఖః=సూర్యునికెదురుగానుండుకొని , జలం=ఉదకమును, ఉదుత్యంజాతవేదసమితి = ఉదుత్యంజాతవేదసమనే మంత్రేణ = మంత్రముచేతను , నిక్షిపేత్ = అర్ఘ్యముయివిడువవలయును.

మూ॥ ఏషఏవ విధిః ప్రోక్తః సంధ్యయోశ్చ ద్విజాతిషు।పూర్వాం
సంధ్యాం జపంస్తిష్ఠేదాసీనః పశ్చిమాం తథా.౧౮

టీక॥ ద్విజాతిషు=ద్విజాతులయందు (ద్విజాతులకు,) సంధ్యయోఃచ=

రెండుసంధ్యలలో, ఏవంచ = ఇట్లే, విధిః = విధానము, ప్రోక్తః = చెప్పబడియున్నది, పూర్వాం = ప్రాతఃకాలపు, సంధ్యాం = సంధ్యను, జపన్ = జపించుచు, తిష్ఠేత్ = నిలుచుకొనియుండవలయును, తథా = అటువలెనే, పశ్చిమాం = సాయంకాలపుసంధ్యను, ఆసీనః = కూర్చుండినవాడై (జపించవలయును.)

మూ॥ తతో జపేత్ పవిత్రాణి పవిత్రం వాథశక్తితః। ఋషయో
దీర్ఘసంధ్యత్వా ద్దీర్ఘమాయురవాప్నువన్. ౧౯

టీక॥ తతః = తర్వాత, పవిత్రాణి = పావనమంత్రములను, అథవా = లేక, శక్తితః = శక్తికొలది, పవిత్రం = ఒకపావనమంత్రమునైనా, జపేత్ = జపించవలయును, ఋషయః = ఋషులు, దీర్ఘసంధ్యత్వాత్ = దీర్ఘకాలముగా సంధ్య జేయువారగుటవలన, దీర్ఘం = చిరకాలమయిన, ఆయుః = ఆయుస్సును, అవాప్నువన్ = పొందిరి

ఇతి శ్రీశంఖస్మృతౌ దశమోధ్యాయః.

టీ॥ శ్రీశంఖస్మృతౌ = శంఖస్మృతియందు, దశమోధ్యాయః = పదవ, అధ్యాయము, ఇతి = ముగిసెను.







శ్రీ

# అథశంఖస్మృతి

## ఏకాదశాధ్యాయ ప్రారంభః.

మూ॥ సర్వవేద పవిత్రాణి వక్ష్యామ్యహ మతఃపరమ్ యేషాంజ
పైశ్చహోమైశ్చ పూయంతే మానవాస్సదా ౧

టీక॥ యేషాం=ఏమంత్రములయొక్క, జపైశ్చ=జపములచేతను, హోమైశ్చ=హోమములచేతను, మానవాః=మనుజులు, సదా=ఎల్లప్పుడు, పూయంతే=పరిశుద్ధులగుచున్నారో, సర్వవేదపవిత్రాణి=(అట్టి)సర్వవేదములలో జెప్పబడిన పావనమంత్రములను, అతఃపరం=ఇకమీదట, అహం=నేను, వక్ష్యామి=చెప్పుచున్నాను.

మూ॥ అఘమర్షణం దేవవ్రతం శుద్ధవత్యశ్చ తత్సమాః।
కూష్మాండ్యః పావమాన్యశ్చ సర్వసావిత్ర్యేవచ. ౨

మూ॥ అభీష్టద్రుపదాచైవ స్తోమాని వ్యాహృతీస్తథా ।
భారుండానిచ సామాని గాయత్ర్యైవ్రతంతథా. ౩

మూ॥ పురుషవ్రతంచ భాసంచ తథాసోమవ్రతానిచ ।
అబ్లింగం బార్హస్పత్యంచ వాక్సూక్తమమృతం తథా. ౪

మూ॥ శతరుద్రీయ మథర్వశిర స్త్రిసుపర్ణం మహావ్రతమ్।
గోసూక్తమశ్వసూక్తంచ ఇంద్రసూక్తంచ సామని. ౫

మూ॥ త్రీణ్యాజ్యదోహాని రథంతరంచ అగ్నేర్వ్రతం
వామదేవ్యంచసామ। ఏతాని గీతాని పునంతిజంతూన్
జాతిస్మరత్వం లభతే యదిచ్ఛేత్. ౬

టీక॥ అఘమర్షణం = అఘమర్షణసూక్తము, దేవవ్రతం=దేవవ్రతసూక్తముని, తత్సమాః=వాట్లతో సమమైనశుద్ధవత్యశ్చ=శుద్ధినికలుగచేసెడుఋక్కులును, కూశ్మాండ్యః=కూశ్మాండమంత్రలు, పావమాన్యశ్చ=పావమానీఋక్కులు, సర్వసావిత్ర్యఃఏవచ=అన్నిగాయత్రులును, అభీష్టద్రుపదాచఏవ=అభీష్టమునిచ్చెద్రుపదాగాయత్రియు, స్తోమాని=స్తోమసామములు, తథా=అటువలెనే, వ్యాహృతిః=వ్యాహృతిమంత్రమును, భారుండానిచ=భారుండమనే, సామాని=సామములు , తథైవ=అటువలెనే, గాయత్ర్యాఃవ్రతం=గాయత్రీవ్రతమనేసామమును, పురుషవ్రతంచ=పురుషవ్రతమనేసూక్తము , భాషంచ=భాషమనేసూక్తమును, తథా=అటువలెనే, సోమవ్రతానిచ=సోమవ్రతమనేసూక్తములును, అబ్లింగం=అబ్లింగసూక్తము, బార్హస్పత్యంచ=బార్హస్పత్యసూక్తము, వాక్సూక్తః=వాక్సూక్తము, తథా=అటువలెనే, అమృతం=అమృతమనేసూక్తమును ,శతరుద్రీయం=శతరుద్రీయమనేసూక్తము, అథర్వశిరః=అథర్వశిరస్సుఅనేసూక్తము , త్రిసుపర్ణం = త్రిసుపర్ణమనేసూక్తము, మహావ్రతం=మహావ్రతమనేసూక్తము, గోసూక్తం=గోసూక్తము, అశ్వసూక్తంచ=అశ్వసూక్తమును, ఇంద్రసూక్తంచ=ఇంద్రసూక్తము, (సామని)సామాని=(ఈ)సామములు, త్రీణి=మూడు, ఆజ్యదోహాని=ఆజ్యదోహసామములు, రథంతరంచ=రథంతరసామము, అగ్నేవ్రతం=అగ్నేవ్రతసామము, వామదేవ్యంచసామ=వామదేవ్యసామము, ఏతాని=ఇవి, గీతాని=గానముచేయబడినవై , జంతూన్-ప్రాణులను ; పునంతి= పవిత్రములుచేయుచున్నవి, ఇచ్ఛేత్ యది=కోరినట్టైతే, జాతిస్మరత్వం=పూర్వజన్మజ్ఞానమును, లభతే=(గానముచేయువాడు)పొందుచున్నాడు.

ఇతిశంఖస్మృతౌ ఏకాదశోధ్యాయః

టీక॥ శంఖస్మృతౌ=శంఖస్మృతియందు, ఏకదశోధ్యాయః= పదనకొండవఅధ్యాయము; ఇతి=ముగిసెను.









అథశంఖస్మృతౌ.

ద్వాదశాధ్యాయ ప్రారంభః

మూ॥ ఇతి వేదపవిత్రాణ్యభిహితాని. ౧

టీక॥ ఇతి=ఈచొప్పున, వెదపవిత్రాణి = వేదములోనుండిన పావన మంత్రములు, అభిహితాని=చెప్పబడినవి.

మూ॥ ఏభ్యస్సావిత్రీ విశిష్యతే. ౨ *

టీక॥ ఏభ్యః = వీనికంటె, సావిత్రీ = గాయత్రీమంత్రము, విశిష్యతె = విశిష్టమైనది.

మూ॥ నాస్త్యఘమర్షణాత్పర మంతర్జలేజప్యమ్. ౩

టీక॥ అంతర్జలేజప్యం = నీటిలో జపముచేయవలసినది, అఘమర్షణాత్ =అఘమర్షణమంత్రముకంటె, పరం=ఎకుడైనది, నాస్తి=లేదు.

మూ॥ నసావిత్ర్యాసమం జప్యం. ౪

టీక॥ జప్యం =జపించదగినది, సావిత్ర్యాసమం = సావిత్రికిసమమైనది, న=లేదు.

మూ॥ నవ్యాహృతిసమంహుతం. ౫

టీక॥ హుతం=హోమము, వ్యాహృతిసమం = వ్యాహృతితోసమమైనది, న=లేదు.

మూ॥ కుశబ్రుస్యామాసీనః కుశోత్తరీయః కుశపవిత్రపాణిః ప్రాఙ్ముఖస్సూర్యాభిముఖోవా, అక్షమాలా ముపాదాయ దేవతాధ్యాయీ జపం కుర్యాత్.

టీక॥ కుశబ్రుస్యాం= దర్భాసనమందు, ఆసీనః= కూచున్నవాడై,

కుశోత్తరీయః= దర్భలను ఉత్తరీయముగాగలవాఁడై, కుశపవిత్రపాణిః=దర్భపవిత్రమును చేతిలోగలవాడై, ప్రాఙ్ముఖః = తూర్పుముఖుడై,వా=లేక, సూర్యాభిముఖః=సూర్యాభిముఖుడై, అక్షమాలాం= జపమాలను, ఉపాదాయ=తీసికొని, దేవతాధ్యాయీ = దేవతనుధ్యానముచేయుచున్నవాఁడై,జపం=జపమును,కుర్యాత్ = చేయవలయును.

మూ॥ సువర్ణమణిముక్తాస్ఫాటికపద్మాక్షరుద్రాక్షపుత్రజీవకానామన్యతమేనాక్షమాలాంకుర్యాత్. ౭

టీ॥ సువర్ణమణిముక్తాస్ఫాటికపద్మాక్షరుద్రాక్షపుత్రజీవకానాం= బంగారము, నవరత్నములు, ముత్యము, స్ఫటికము, తామరపూసలు, రుద్రాక్షలు,పుత్రజీవివిత్తనములు, వీనిలో, అన్యతమేన = ఒకటిచేత, అక్షమాలాం = జపమాలను, కుర్యాత్=చేయవలయును.

మూ॥ కుశగ్రంథింకృత్వావాగణయేత్. ౮

టీ॥ కుశగ్రంధిం=దర్భముడిని, కృత్వావా = చేసికొని అయినను, గణయేత్ = (మంత్రెఆవర్తిని) ఎంచవలయును.

మూ॥ ఆదౌదేవతర్షిచ్ఛందస్స్మరేత్. ౯

టీ॥ఆదౌ=ఆరంభమందు. దేవతర్షిచ్ఛందః= దేవతను ఋషిని ఛందస్సును, స్మరేత్=స్మరించవలయును.

మూ॥ తతస్సప్రణవసవ్యాహృతికామాదావంతే
శిరసాగాయత్రీమావర్తయేత్. ౧౦

టీ॥ తతః=అనంతరమందు, ఆదౌ = మొదట,సప్రణవ సవ్యాహృతికాం=ప్రణవమంత్రముచేసిన వ్యాహృతులుగలదిగా, అంతే=కొనలో, శిరసా= శిరోమంత్రముతోగూడినదిగాను, గాయత్రీం = గాయత్రీమంత్రమును, ఆవర్తయేత్=వల్లించవలయును.

మూ॥ దేవతాస్యాస్సవితా ఋషిర్విశ్వామిత్రో గాయత్రీ ఛందః. ౧౧
టీ॥ అస్యాః=దీనికి (గాయత్రికి) సవితా=సూర్యుడు, దేవతా= దేవ

త, ఋషిః=ఋషి,విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడు, గాయత్రీ=గాయత్రి,ఛందః=ఛందస్సు.

మూ॥ప్రణవాద్యాభూర్భువస్స్వర్మహర్జనస్త

పస్సత్యమితివ్యాహృతయః. ౧౨

టీక॥ ప్రణవాద్యాః = ప్రణవపూర్వకములైన, భూః భువః సువః మహః జనః తపః సత్యం ఇతి=ఈపేళ్లుగల ఏడు మంత్రములు , వ్యాహృతయః=వ్యాహృతులు (అనేపేలుఁగలవి)

మూ॥ ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువ

స్సువరోమితిశిరః. ౧౩

టీక॥ ఓం ఆపః జ్యోతిః రసః అమృతం బ్రహ్మ భూఃభువః సువః ఓం ఇతి= ఈపేళ్లుగలవి, శిరః=శిరోమంత్రములు (అనేపేలుఁగలవి.)

మూ॥ భవంతిచాత్రశ్లోకాః. ౧౪

టీక॥ అత్ర= ఈఅర్థమందు, శ్లోకాః = (ప్రమాణ) శ్లోకములు, భవంతి= ఉన్నవి.

మూ॥ సవ్యాహృతింసప్రణవాం గాయత్రీం శిరసాసహ।యేజపంతి

సదాతేషాం నభయం విద్యతే క్వచిత్॥ ౧౫

టీక॥ సవ్యాహృతిం = వ్యాహృతి మంత్రముతోఁగూడిన, సప్రణవాం = ప్రణవముతోఁగూడిన, గాయత్రీం=గాయత్రీ మంత్రమును, శిరసాసహ= శిరోమంత్రముతోఁగూడ, యే=ఎవరు, సదా=ఎల్లప్పుడు, జపంతి=జపించుచున్నారో, తేషాం=వారికి, క్వచిత్ = దేనియందును, భయం=భయము, నవిద్యతే=కలుగదు.

మూ॥ దశజప్తాతు సాదేవీ దిన పాపప్రణాశినీ।

శతజప్తా తథాసాతు అబ్దపాపప్రణాశినీ. ౧౬

టీక॥ దశజప్తాతు=పదిమార్లు జపించబడిన, సాదేవీ=ఆగాయత్రిదేవి, దినపాపప్రణాశినీ = ఆయాదినపుపాపమును పోగొట్టునది, శతజప్తాతు= నూరుసార్లుజపించబడిన(గాయత్రీ)తథా=అటువలెనే, అబ్దపాపప్రణాశనీ=ఒకసంవత్సరపు పాపమునుపోగొట్టునది.

మూ॥ సహస్రజప్తాతు జనాన్పాతకేభ్య స్సముద్ధరేత్
దశసాహస్రజప్తాతు సర్వకల్మషనాశినీ. ౧౭

టీక॥ సహస్రజప్తాతు=వెయిసార్లుజపించబడిన(గాయత్రి,)జనాన్= జనులను, పాతకేభ్యః=పాపములవల్లనుండి, సముద్ధరేత్ = ఉద్ధరించును, దశసాహస్రజప్తాతు=పదివేలమార్లుజపించబడిన (గాయత్రి) సర్వకల్మషనాశినీ=అన్నిపాపములను పోగొట్టునది.

మూ॥ స్వర్ణస్తేయీ కృతఘ్నశ్చ బ్రహ్మహా గురుతల్పగః।
సురాపశ్చవిశుద్ధ్యేత లక్షజాపాన్నసంశయః. ౧౮

టీక॥ స్వర్ణస్తెయీ = బంగారమునుదొంగలించువాడు, కృతఘ్నఃచ = కృతఘ్నుడు, బ్రహ్మహా=బ్రహ్మహత్యచేసినవాడు , గురుతల్పగః = గురుభార్యాగమనముచేయువాడు , సురాపఃచ = మద్యపానముచేయు వాడు, లక్షజాపాత్ =లక్షసార్లు (గాయత్రీ)జపముచేతను, విశుద్ధ్యేత=శు ద్ధుడగుచున్నాడు, నసంశయః=సందేహములేదు.

మూ॥ ప్రాణాయామత్రయం కృత్వాస్నానకాలే సమాహితః
అహోరాత్రకృతాత్పాపా త్తత్క్షణాదేవ ముచ్యతే. ౧౯

టీక॥ స్నానకాలే=స్నానకాలమందు,(మునిగి) ప్రాణాయామత్రయం= మూడుప్రాణాయామములను , సమాహితః=ఏకాగ్రచిత్తుడై, కృత్వా= చేసి, అహోరాత్రకృతాత్=పగలురాత్రిచేసిన, పాపాత్=పాపమువల్ల నుంచి, తత్క్షణాత్ఏవ=తత్క్షణమె, ముచ్యతే=విడువబడుతాడు.

మూ॥ సవ్యాహృతికాస్స ప్రణవాః ప్రాణాయామాస్తు షోడశ।

డశ। అపిభ్రూణహనంమాసాత్పునంత్యహరహఃకృతాః. ౨౦

టీక॥ సవ్యాహృతికాః=వ్యాహృతిమంత్రముతోకూడిన, సప్రణవాః=ప్రణవముతోకూడిన, షోడశ=పదునారు, ప్రాణాయామాఃతు=ప్రాణాయామములు, మాసాత్=ఒకనెలపర్యంతం, అహరహః=ప్రతిదినము, కృతః=చేయబడినవై, భ్రూణహనంఅపి=చతుర్వేదవిద్బ్రాహ్మణహత్య చేయువానినికూడ, పునంతి=పరిశుద్ధముచేయుచున్నవి.

హుతాదేవీవిశేషేణ సర్వకామప్రదాయినీ। సర్వపాపక్ష
యకరీవరదా భక్తవత్సలా. ౨౧

టీ॥ వరదా=వరమునిచ్చె, భక్తవత్సలా=భక్తులయందుప్రియముగల, దేవీ=గాయత్రి, హుతా=హోమమందునియోగింపబడినదై, విశేషేణ=మిక్కిలి, సర్వకామప్రదాయినీ=అన్నికోరికలనుయిచ్చునది, సర్వపాపక్షయకరీ=అన్నిపాపములనుపోగొట్టునది.

శాంతికామస్తు జుహుయాత్సావిత్రీమక్షతైశ్శుచిః ।
హంతుకామోపమృత్యుంచ ఘృతేనజుహుయాత్తథా. ౨౨

టీక॥శాంతికామః=మంగళముకోరువాడు, శుచిః=శుద్ధుడుగానుండుకొని, అక్షతైః=అక్షతలచేతను, సావిత్రీం=గాయత్రిని, జుహుయాత్=హోమమందువినియోగపరచవలయును, తథా=అటువలెనే, అపమృత్యుం=అకాలమృత్యువును,హంతుకామఃచ=పోగొట్టుకొనుటనుకోరువాడు, ఘృతేన=నేతితోటి, జుహుయాత్=హోమముచేయవలయును.

శ్రీకామస్తు తథాపద్మైర్బిల్వైఃకాంచనకాముకః। బ్రహ్మవ
ర్చసకామస్తు పయసాజుహుయాత్తథా. ౨౩

టీ॥ తథా=అటువలెనే, శ్రీకామఃతు=భాగ్యముకోరువాడు ,పద్మైః=తామరపుష్పములచేతను,కాంచనకాముకః=బంగారమునునిచ్ఛయించువాడు బిల్వైః=బిల్వపత్రములచేతను , తథా=అటువలెనే, బ్రహ్మవర్చసకా

మః=బ్రహ్మవర్చస్సును కోరువాడు, పయసా=పాలుచేతను, జుహుయాత్= హోమము చేయవలయును.

ఘృతప్లుతై స్తిలైర్వహ్నౌ జుహుయాత్సుసమాహితః। గాయత్ర్యాయుత హోమాత్తు సర్వపాపైః ప్రముచ్యతే. ౨౪

టీ॥ సుసమాహితః=మిగులజాగరూకుడై, ఘృతప్లుతైః=నేతిచేతతడపబడిన, తిలైః=నువ్వులచేతను, వహ్నౌ=అగ్నియందు, జుహుయాత్= హోమముచేయవలయును, గాయత్ర్యా=గాయత్రీమంత్రముతోటి, అయుత హోమాత్ తు=పదివేలఆహుతులచేతను, సర్వపాపైః=అన్నిపాపములచేత, ప్రముచ్యతే=విడవబడుచున్నాడు.

పాపాత్మా లక్షహోమేన పాతకేభ్యః ప్రముచ్యతే ।
అభీష్టం లోకమాప్నోతి ప్రాప్నుయాత్కామమీప్సితం. ౨౫

టీ॥ పాపాత్మా=పాపాత్ముడు, లక్షహోమేన=(తిలలతోటి) లక్షహోమమునుచేయుటచేతను, పాతకేభ్యః=(మహా) పాతకములలోనుంచి, ప్రముచ్యతే=విడవబడుచున్నాడు, అభీష్టం=కోరిన, లోకం=(ఉత్తమ) లోకమును, ఆప్నోతి=పొందుచున్నాడు, ఈప్సితం=కోరిన, కామం=పదార్థమును, ప్రాప్నుయాత్=పొందుచున్నాడు.

గాయత్రీ వేద జననీ గాయత్రీ పాపనాశినీ। గాయత్ర్యాః పరమం నాస్తి దివి చేహ చ పావనం. ౨౬

టీ॥ గాయత్రీ=గాయత్రి, వేదజననీ=వేదమునకుతల్లి, గాయత్రీ=గాయత్రి, పాపనాశినీ=పాపమునుపోగొట్టునది, గాయత్ర్యాః=గాయత్రికంటె, పరమం=శ్రేష్ఠమైన, పావనం=పవిత్రముచేసేది, దివి చ=స్వర్గమందును, ఇహ చ=ఈలోకమందును, న అస్తి=లేదు.

హస్తత్రాణ పరా దేవీ పతతాం నరకార్ణవే। తస్మాత్తామభ్యసేన్నిత్యం బ్రాహ్మణో నియతశ్శుచిః. ౨౭

టీ॥ దేవీ=గాయత్రి, నరకార్ణవే=నరకమనేసముద్రమందు, పతతాం=

పడెడువారలకు, హస్త్రత్రాణపరా = చెయ్యిచ్చికాపాడడమునుముఖ్యముగాగలది, తస్మాత్ = గనుక, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, శుచిః = శుద్ధుడై, నియతః = నియతుడై, తాం = ఆగాయత్రిని, అభ్యసేత్ = జపముచేయవలయును. ✿

గాయత్రీ జప్యనిరతం హవ్యకవ్యేషు భోజయేత్ ।
తస్మిన్నశ్లిష్యతే పాపమబ్బిందురివపుష్కరే. ౨౮

టీక॥ గాయత్రీజప్యనిరతం = గాయత్రీజపమందుఆసక్తిగలవానిని, హవ్యకవ్యేషు = హవ్యకవ్యములయందు, భోజయేత్ = భుజింపచేయవలయును, తస్మిన్ = వానియందు, పుష్కరే = తామరాకుయందు, అబ్బిందుః ఇవ = జలబిందువువలెనే, పాపం = పాపము, నశ్లిష్యతే = అంటదు.

జప్యేనైవతు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్రసంశయః ।
కుర్యాదన్యం నవాకుర్యాన్మైత్రో బ్రాహ్మణఉచ్యతే. ౨౯

టీక॥ బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, జప్యేనఏవతు = (గాయత్రీ) జపముచేతనే, సంసిద్ధ్యేత్ = సిద్ధుడగుచున్నాడు, అత్ర = ఈవిషయమందు, నసంశయః = సందేహములేదు, అన్యం = వేరొకకర్మను, కుర్యాత్ = చేసినను, నవాకుర్యాత్ = చేయకపోయినను, మైత్రః = (గాయత్రిచేత) సూర్యోపాసనాపరుడు బ్రాహ్మణః = (ముఖ్య) బ్రాహ్మణుడుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

ఉపాంశుస్స్యాచ్ఛతగుణః సహస్రోమానస స్స్మృతః। నోచ్చైర్జ
ప్యం బుధఃకుర్యాత్సావిత్ర్యాస్తువిశేషతః. ౩౦

టీక॥ ఉపాంశుః = రహస్యజపము, శతగుణః = ఒకటికినూరంతగా, స్యాత్ = అగును, మానసః = మానసజపము, సహస్రః = ఒకటికివెయ్యంతగా, స్మృతః = చెప్పబడియున్నది, బుధః = తెలిసినవాడు, ఉచ్చైర్జప్యం = బిగ్గరగజపమును, నకుర్యాత్ = చేయకూడదు, సావిత్ర్యాః తు = గాయత్రీజపవిషయములో, విశేషతః = ముఖ్యముగా, (బిగ్గరజపముచేయకూడదు.)

సావిత్రీజాప్యనిరతః స్వర్గమాప్నోతి మానవః। గాయత్రీజ

ప్యనిరతో మోక్షోపాయంచవిందతి. ౩౧

టీక॥ సావిత్రీజాప్యనిరతః=గాయత్రీజపమందుఆసక్తుడైన, మానవః=మనుజుడు, స్వర్గం=స్వర్గమును, ఆప్నోతి=పొందుచున్నాడు, గాయత్రీజప్యనిరతః= గాయత్రీజపమందుఆసక్తిగలవాడు, మోక్షోపాయంచ=మోక్షసాధకమైనమార్గమును, విందతి=పొందుచున్నాడు. *

తస్మాత్సర్వ ప్రయత్నేన స్నాతఃప్రయతమానసః ।
గాయత్రీంతు జపేద్భక్త్యా సర్వపాపప్రణాశినీమ్. ౩౨

టీక॥ తస్మాత్=గనుక, స్నాతః=స్నానముచేసినవాడై, ప్రయతమానసః=స్థిరమానసుడై, సర్వప్రయత్నేన=అన్నిప్రయత్నములచేతను, సర్వపాపప్రణాశినీం=సమస్తపాపములనుపోగొట్టు, గాయత్రీంతు=గాయత్రిని, భక్త్యా=భక్తితోటి, జపేత్=జపించవలయును.

ఇతిశంఖస్మృతౌ ద్వాదశోధ్యాయః

టీక॥ శంఖస్మృతౌ=శంఖస్మృతియందు, ద్వాదశోధ్యాయః=పనిరెండవఅధ్యాయము; ఇతి=ముగిసెను.





శ్రీరస్తు.

అథశంఖస్మృతౌ.

త్రయోదశాధ్యాయ ప్రారంభః.

స్నాతః కృతజప్య స్తదను ప్రాఙ్ముఖో దివ్యేన తీర్థేన దేవానుదకేన తర్పయేత్. ౧

టీక॥ స్నాతః=స్నానము చేసినవాడై, కృతజప్యః=జపము చేసినవాడై, తదను=వెనుక, ప్రాఙ్ముఖః=తూర్పుముఖుడై, దివ్యేన = దివ్యమనే, తీర్థేన=తీర్థముచేతను, దేవాన్ = దేవతలను, ఉదకేన = జలముతోటి, తర్పయేత్ =తర్పణము చేయవలయును.

ప్రత్యృచం పురుష సూక్తేనోదకాంజలీన్దద్యాత్ పుష్పాఞ్జలీన్ భక్త్యా. ౨

టీక॥ పురుషసూక్తేన= పురుషసూక్తముతోటి, ప్రత్యృచం=ప్రతిఋక్కుకున్ను, ఉదకాంజలీన్=దోసిలినీళ్లను, పుష్పాఞ్జలీన్=దోసిలిపువ్వులను, భక్త్యా=భక్తితోటి, దద్యాత్=ఇయ్యవలయును.

అథకృతాపసవ్యో దక్షిణాముఖోంతర్జానుః పిత్ర్యేణ పితౄణాం యథాశ్రాద్ధ ప్రకారం సౌవర్ణేన పాత్రేణ రాజతేనౌదుంబరేణ ఖడ్గపాత్రేణ అన్యపాత్రేవా ఉదకందద్యాత్. ౩

టీక॥ అథ=అనంతరమందు, కృతాపసవ్యః = అపసవ్యముచేసికొనినవాడై, దక్షిణాముఖః =దక్షిణాభిముఖుడై, అంతర్జానుః=రెండుమోకాళ్లనడుమ రెండుచేతులువచ్చులాగున కూచున్నవాడై, పిత్ర్యేణ=పితృతీర్థముచేత, పితౄణాం=పితృదేవతలకు, యథాశ్రాద్ధప్రకారం=శ్రాద్ధరీతిచొప్పున, సౌవర్ణేన = బంగారు, పాత్రేణ=పాత్రతోటి (గాని), రాజతేన=వెండిపాత్రతోటి(గాని), ఔదుంబరేణ=అత్తికొయ్యపాత్రతోటి(గాని), ఖడ్గపాత్రేణ = ఖడ్గపాత్రతోటి(గాని,) అన్యపాత్రేణవా=ఇతరపాత్రతోటి

(గాని), ఉదకం=జలమును, దద్యాత్=ఇయ్యవలయును.

పిత్రేపితామహాయ మాత్రేపితామహ్యై, మాతామహా
యప్రమాతామహాయ, మాతామహ్యై ప్రమాతామహ్యై
ఇత్యాది సప్తమాత్పురుషాద్యావన్నామ జానీయాత్. ౪

టీక॥ పిత్రే=తండ్రికొరకు, పితామహాయ=తాతకొరకు, మాత్రే=తల్లికొరకు, పితామహ్యై=తండ్రితల్లికొరకు, మాతామహాయ=తల్లితండ్రికొరకు, ప్రమాతామహాయ=తల్లితాతకొరకు, మాతామహ్యై=తల్లితల్లికొరకు, ప్రమాతామహ్యై=తల్లిఅవ్వకొరకు, ఇత్యాది = ఇది మొదలు, సప్తమాత్ =ఏడవ, పురుషాత్ =పురుషునివరకు, యావత్=ఎంతవరకు, నామ జానీయాత్=పేరు తెలిసికొనియున్నాడో, (అంతవరకుతర్పణము చేయవలయును.)

పితృపక్షాణాం తర్పణంకృత్వా మాతృపక్షాణాం
గురూణాం సంబంధి బాంధవానాం సుహృదాంచ
కుర్యాత్ భవంతి చాత్రశ్లోకాః. ౫

టీక॥ పితృపక్షాణాం=తండ్రివర్గపువారికి, మాతృపక్షాణాం = తల్లివర్గపువారికి, తర్పణం=తర్పణమును, కృత్వా=చేసి, గురూణాం= ఆచార్యులకు, సంబంధిబాంధవానాం=సంబంధులకు, బాంధవులకు, సుహృదాంచ=స్నేహితులకు, కుర్యాత్ = (తర్పణము) చేయవలయును, అత్ర= ఈవిషయమందు, శ్లోకాః=(ప్రమాణ)శ్లోకములు, భవంతి=గలవు.

వినారౌప్య సువర్ణేన వినాతామ్రతిలేనచ ।
వినాదర్భైశ్చ మంత్రైశ్చ పితౄణాం నోపతిష్ఠతే. ౬

టీక॥ రౌప్యసువర్ణేనవినా = వెండిబంగారములేక, తామ్రతిలేనచవినా=రాగినువ్వులులేక, దర్భైశ్చవినా= దర్భలులేక, మంత్రైశ్చ = మంత్రములు (లేక) పితౄణాం = పితృదేవతలకు, నఉపతిష్ఠతే= (తర్పణము)

పొందదు.

సౌవర్ణరాజ తాభ్యాంచ ఖడ్గేనౌ దుంబరేణవా ।
దత్తమక్షయతాంయాతిపితౄణాంతు తిలోదకం. ౭

టీక॥ సౌవర్ణరాజతాభ్యాంచ=బంగారవుపాత్రతోటిగాని వెండిపాత్రతోటిగాని, ఖడ్గేన=ఖడ్గపాత్రతోటిగాని, ఔదుంబరేణవా = అత్తికొయ్యపాత్రతోటిగాని, దత్తం=ఇయ్యబడిన, తిలోదకంతు=తిలోదకము, పితౄణాం=పితృదేవతలకు, అక్షయతాం=అక్షయముగానుండుటను; యాతి=పొందుచున్నది.

హేమ్నాతు సహయద్దత్తం క్షీరేణమధునాసహ ।
తదప్యక్షయతాంయాతి పితౄణాంతు తిలోదకం. ౮

టీక॥ హేమ్నాతుసహ=బంగారముతోడను, క్షీరేణమధునాసహ=పాలతోడను తేనెతోడను, యత్=ఏ(తిలోదకము), దత్తం=ఇవ్వబడినదో, తత్=ఆ, తిలోదకంఅపి=తిలోదకమును; పితౄణాంతు = పితృదేవతలకు, అక్షయతాం=అక్షయముగానుండుటను, యాతి=పొందుచున్నది.

కుర్యాదహరహః శ్రాద్ధ మన్నాద్యే నోదకేనవా ।
పయోమూలఫలైర్వాపి పితౄణాం ప్రీతిమావహన్. ౯

టీక॥ ప్రీతిం=విశ్వాసమును, ఆవహన్=వహించినవాడై, అహరహః=ప్రతిదినము, అన్నాద్యేన=అన్నముచేత(గాని), ఉదకేనవా=ఉదకముచేతగాని, పయోమూలఫలైఃవాఅపి=పాలచేతగాని, కందమూలఫలములచేతగాని, పండ్లచేతగాని, పితౄణాం=పితృదేవతలకు, శ్రాద్ధం=శ్రాద్ధకర్మను, కుర్యాత్=చేయవలయును.

స్నాతస్తుతర్పణం కృత్వా పితౄణాంతు తిలాంభసా ।
పితృయజ్ఞ మవాప్నోతి ప్రీణాతిచ పితౄంస్తథా. ౧౦

టీక॥ స్నాతఃతు=స్నానముచేసినవాడై, పితౄణాంతు = పితృదేవతలకు,

తిలాంభసా=తిలోదకముచేతను, తర్పణంకృత్వా=తర్పణముచేసి, పితృయజ్ఞం=పితృయజ్ఞకర్మ(ఫలమును), అవాప్నోః=పొందుచున్నాడు, తథా=అటువలెనే, పితౄన్=పితృదేవతలను, ప్రీణాతిచ = తృప్తులుగాచేయుచున్నాడు. *

ఇతి శ్రీశంఖస్మృతౌ * త్రయోదశోధ్యాయః
శ్రీశంఖస్మృతౌ=శంఖస్మృతియందు
త్రయోదశోధ్యాయః = పదమూడవఅధ్యాయము
ఇతి=ముగిసెను.





శ్రీరస్తు.

## అథశంఖస్మృతౌ.

### చతుర్దశాధ్యాయప్రారంభః.

బ్రాహ్మణాన్నపరీక్షేత దైవేకర్మణిధర్మవిత్ ।
పిత్ర్యేకర్మణి సంప్రాప్తేయుక్తమాహుఃపరీక్షణమ్. ౧

టీక॥ దైవేకర్మణి=హవ్యకర్మమునందు, ధర్మవిత్=ధర్మముతెలిసినవాడు, బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను, నపరీక్షేత=పరీక్షచేయకూడదు, పిత్ర్యేకర్మణి=కవ్యకర్మము, సంప్రాప్తే=ప్రాప్తమగుచుండగా, పరీక్షణం=పరీక్షించడము, యుక్తం=అవశ్యకముగా, ఆహుః=(పెద్దలు) చెప్పుచున్నారు. ❀

బ్రాహ్మణాయేవికర్మస్థా బైడాలవ్రతికాస్తథా ।
ఊనాంగా అతిరిక్తాంగా బ్రాహ్మణాఃపఙ్క్తిదూషకాః. ౨

టీక॥ యే=ఏ, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, వికర్మస్థాః=నిషిద్ధకర్మముచేయువారో, తథా=అటువలెనే, బైడాలవ్రతికాః=కపటాచారముగలవారో, ఊనాంగాః=అవయవలోపముగలవారో, అతిరిక్తాంగాః=అధికఅవయవముగలవారో, బ్రాహ్మణాః=(అట్టి)బ్రాహ్మణులు, పఙ్క్తిదూషకాః=పఙ్క్తిభోజనమునకుఅనర్హులు. ❀

గురూణాంప్రతికూలాశ్చవేదాగ్న్యత్యాదినశ్చయే ।
గురూణాంత్యాగినశ్చైవ బ్రాహ్మణాః పఙ్క్తిదూషకాః. ౩

టీక॥ యే=ఏ, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, గురూణాం=ఆచార్యులకు, ప్రతికూలాఃచ=ప్రతికూలులో, వేదాగ్న్యత్యాదినఃచ=వేదమునుఅగ్నినివిడిపించినవారో, గురూణాం=ఆచార్యులను, త్యాగినఃచ=విడిచిపెట్టినవారో, పఙ్క్తిదూషకాఃఏవ=(వారు)పఙ్క్తిబాహ్యులే.

అనధ్యాయేష్వధీయానాః శౌచాచారవివర్జితాః ।

శూద్రాన్నరస సంపుష్టాబ్రాహ్మణాః పఙ్క్తిదూషకాః. ౪

టీక॥ అనధ్యాయేషు = అధ్యయనముచేయరానిదినములలో, అధీయానాః=అధ్యయనముచేయువారు, శౌచాచారవివర్జితాః=శుద్ధిఆచారమునువిడిచిపెట్టినవారు, శూద్రాన్నరససంపుష్టాః=శూద్రునియొక్క అన్నరసముచేతపెరిగినవారు, బ్రాహ్మణాః=(ఇట్టి)బ్రాహ్మణులు, పఙ్క్తిదూషకాః=పఙ్క్తిబాహ్యులు. ✽

షడంగవిత్త్రిసుపర్ణో బహ్వృచో జ్యేష్ఠసామగః ।
త్రిణాచికేతః పఞ్చాగ్నిర్బ్రాహ్మణః పఙ్క్తిపావనః. ౫

టీక॥ షడంగవిత్ = ఆరువేదాంగములుతెలిసినవాడు, త్రిసుపర్ణః=త్రిసుపర్ణమనేఋక్కునుజపించినవాడు, బహ్వృచః= ఋగ్వేదముపఠించినవాడు, జ్యేష్ఠసామగః = జ్యేష్ఠసామమునుగానముచేయువాడు, త్రిణాచికేతః=త్రిణాచికేతమనేయజుర్వేదైకదేశమునుతెలిసినవాడు, పఞ్చాగ్నిః=అయిదువిధములైనశ్రౌతాగ్నులుకలిగినవాడు, బ్రాహ్మణః=(ఇట్టి)బ్రాహ్మణుడు, పఙ్క్తిపావనః= (భోజనపఙ్క్తిని)పావనముచేయువాడు.

బ్రహ్మదేయానుసంతానో బ్రహ్మదేయాప్రదాయకః ।
బ్రహ్మదేయాపతిర్యశ్చ బ్రాహ్మణఃపఙ్క్తిపావనః. ౬

టీక॥ యఃచ=ఎవడు, బ్రహ్మదేయానుసంతానః =బ్రాహ్మవివాహప్రకారముఇవ్వతగిన సంతానముగలవాడో, బ్రహ్మదేయాప్రదాయకః = బ్రాహ్మవివాహముచొప్పునకన్యాదానముచేయువాడో, బ్రహ్మదేయాపతిః=బ్రాహ్మవివాహముచొప్పునయెవడుకన్యకుపెనిమిటిఅయినాడో, బ్రాహ్మణః=(ఇట్టి)బ్రాహ్మణుడు, పఙ్క్తిపావనః=పఙ్క్తియోగ్యుడు.

ఋగ్యజుఃపారగోయశ్చ సామ్నాంయశ్చాపిపారగః ।
అథర్వాంగిరసోధ్యేతా బ్రాహ్మణఃపఙ్క్తిపావనః. ౭

టీక॥ యఃచ=ఎవడు, ఋగ్యజుఃపారగః=ఋగ్వేదమునుయజుర్వేదమునుపూర్తిగాచదివినవాడో, యఃచ=ఎవడు, సామ్నాంఅపిపారగః=సామవేదమునుపూర్తిగాచదివినవాడో, అథర్వాంగిరసః = అథర్వణవేద

మును, అధ్యేతా=అధ్యయనముచేసినవాడో, బ్రాహ్మణః= (అట్టి) బ్రాహ్మణుడు, పఙ్క్తి-పావనః=పఙ్క్తి-పావనుడు.

నిత్యంయోగరతోవిద్వాన్సమలోష్టాశ్మకాంచనః ।
ధ్యానశీలోయతిర్విద్వాన్బ్రాహ్మణఃపఙ్క్తి-పావనః. ౮

టీక॥ నిత్యం=(ఎవడు)ఎల్లప్పుడు, యోగరతః=యోగాభ్యాసపరుడో, విద్వాన్=విద్యావంతుడో, సమలోష్టాశ్మకాంచనః= మంటిగడ్డనురాతిని బంగారమునుసమముగాచూచువాడో, ధ్యానశీలః=ధ్యానశీలుడో, విద్వాన్ యతిః=విద్వత్సన్న్యాసముగలవాడో, బ్రాహ్మణః=(అట్టి)బ్రాహ్మణుడు, పఙ్క్తి-పావనః=పఙ్క్తి-యోగ్యుడు. ❋

ద్వౌదైవేప్రాఙ్ముఖౌ త్రీంశ్చపిత్ర్యేచోదఙ్ముఖాంస్తథా ।
భోజయేద్విబుధాన్విప్రానేకైకముభయత్రవా. ౯

టీక॥ దైవే=విశ్వేదేవస్థానమందు,ద్వౌ=ఇద్దరు(బ్రాహ్మణులను)ప్రాఙ్ముఖౌ = తూర్పుముఖముగలవారుగా, తథా=అటువలెనే, పిత్ర్యేచ =పితృస్థానమందు, విబుధాన్ = తెలివిగల,త్రీన్=ముగ్గురు, విప్రాన్=బ్రాహ్మణులను,ఉదఙ్ముఖాన్ = ఉత్తరముఖముగలవారుగా, భోజయేత్=భుజింపచేయవలయును, వా=లేనిపక్షమందు, ఉభయత్ర = రెండుస్థానములయందు, ఏకైకం = ఒక్కొక్కరిని(భుజింపచేయవలయును.)

భోజయేదథవాప్యేకం బ్రాహ్మణంపఙ్క్తి-పావనం ।
దైవేకృత్వాతునైవేద్యంపశ్చాద్వహ్నౌతుతత్క్షిపేత్. ౧౦

టీక॥అథవా=బ్రాహ్మణాభావమందు,పఙ్క్తి-పావనం=పఙ్క్తి-యోగ్యుడైన, ఏకంఅపిబ్రాహ్మణం = ఒకబ్రాహ్మణునిఅయినా, భోజయేత్ = (పితృస్థానమందుమాత్రము) భుజింపచేయవలయును, దైవేతు=విశ్వేదేవస్థానమునకైతేనో, నైవేద్యం=నివేదనము, కృత్వా=చేసి, పశ్చాత్=వెనుక, తత్తు = ఆనివేద్యాన్నమును, వహ్నౌ = అగ్నియందు, క్షిపేత్=వేయవలయును. ❋

ఉచ్ఛిష్టసన్నిధౌకార్యం పిండనిర్వపణంబుధైః ।

అభావేచతథా కార్యంపిండదానం యథావిధి. ౧౧

టీక॥ బుధైః=తెలిసినవారిచేత, పింపనిర్వపణం = పిండదానము, ఉచ్ఛిష్టసన్నిధౌ= (బ్రాహ్మణుల) ఉచ్ఛిష్టపాత్రసమీపమందు, కార్యం= చేయతగ్గది, అభావేచ=ఉచ్ఛిష్టసన్నిధిలేనియడల, పిండదానం=పిండదానము, యథావిధి=శాస్త్రప్రకారము, కార్యం=చేయతగ్గది.

శ్రాద్ధంకృత్వాప్రయత్నేన త్వరాక్రోధవివర్జితః ।
ఉష్ణమన్నంద్విజాతిభ్యః శ్రద్ధయావినివేదయేత్ ।
భోజయేద్విబుధాన్విప్రాన్గంధమాల్య సముజ్వలాన్.

టీక॥ ప్రయత్నేన=యత్నముతోటి, శ్రాద్ధం=శ్రాద్ధహోమమును, కృత్వా=చేసి, త్వరాక్రోధవివర్జితః = వేగిరపాటుకోపములేనివాడై, ద్విజాతిభ్యః=బ్రాహ్మణులకొరకు, ఉష్ణంఅన్నం=వేడిఅన్నమును, వినివేదయేత్=సమర్పించవలయును, విబుధాన్=తెలిసిన, విప్రాన్=బ్రాహ్మణులను, గంధమాల్యసముజ్వలాన్=గంధపుష్పములవలన అలంకరింపబడినవారలుగా, భోజయేత్=భుజింపచేయవలయును.

పక్వంయదాత్మనోగేహే భక్ష్యంవాభోజ్యమేవవా ।
అనివేద్యనభోక్తవ్యం పిండమూలేకదాచన. ౧౩

టీక॥ ఆత్మనః=తనయొక్క, గేహే=గృహమందు, పక్వం=పాకముచేయబడిన, భక్ష్యంవా=పిండివంటఅయినా, భోజ్యంఏవవా=(ఇతర)భోజనద్రవ్యమైనా, యత్=ఏదికలదో, పిండమూలే= (దానిని) పిండసమీపమందు, అనివేద్య=నివేదనచేయక, కదాచన = ఎప్పుడున్ను, నభోక్తవ్యం=భుజింపచేయకూడదు

ఉగ్రగంధాన్యగంధాని చైత్యవృక్షభవానిచ ।
పుష్పాణివర్జనీయాని రక్తవర్ణానియానిచ ।
తోయోద్భవాని దేయాని రక్తాన్యపివిశేషతః. ౧౪

టీక॥ యానిచ=ఏ, పుష్పాణి=పుష్పములు, ఉగ్రగంధాని = కారువాస

నగలవో, అగంధానిచ = వాసనలేనివో, చైత్యవృక్షభవానిచ=బుద్ధగృహమందుండెడి వృక్షమందుపుట్టినటువంటివో, రక్తవర్ణానియాని = (ఎరుపువర్ణముగలవో, వర్జనీయాని=(అట్టివి పిండపూజయందు)విడిపించతగినవి, రక్తానిఅపి=యెరుపువర్ణముగలవైనను,తోయోద్భవాని=ఉదకమందుపుట్టిన పుష్పములు,విశేషతః=ముఖ్యముగా, దేయాని=ఇయ్యతగినవి.

ఊర్ణాసూత్రంప్రదాతవ్యం కార్పాసమథవానవం ।
దశావివర్జయేత్ప్రాజ్ఞో యద్యనాహత వస్త్రజాః. ౧౫

టీక॥ ఊర్ణాసూత్రం = గొర్రెబొచ్చుతోచేయబడినపోగు , అథవా లేక, నవం=నూతనమైన, కార్పాసం = నూలుపోగు, ప్రదాతవ్యం=ఇయ్యతగ్గది, ప్రాజ్ఞః=తెలివిగలవాడు, అనాహతవస్త్రజాయది = కొత్త వస్త్రములైతే, దశాః=వస్త్రపుమొదటిబద్దెను , వివర్జయేత్ =(పిండములమీద)వేయవలయును.

ఘృతేనదీపోదాతవ్య స్తిలతైలేనవాపునః ।
ధూపార్థంగుగ్గులందద్యాద్ఘృతయుక్తమధూత్కటం ।
చందనంచతథాదద్యాత్పిష్ట్వావాకుంకుమంసుమం. ౧౬

టీక॥ ఘృతేన=నెయ్యితోటి, వా=లేక , తిలతైలేన=నువ్వులనూనెతోటి,దీపం=దీపము, దాతవ్యః=ఇయ్యతగినది, ధూపార్థం=ధూపమునకుగాను, ఘృతయుక్తం = నేతితోచేరిన , మధూత్కటం = తేనెతోచేరిన, గుగ్గులం = గుగ్గులమును , దద్యాత్=ఇయ్యవలయును , తథా=అటువలెనే, కుంకుమంసుమం=కుంకుమపువ్వును, పిష్ట్వావా =నూరి (కలిపి) చందనమునున్ను, దద్యాత్ = ఇయ్యవలయును.

భూతృణంసురసం శిగ్రుంపాలఘ్నం సింధుకంతథా ।
కూశ్మాండాలాబువార్తాకకోవిదారాంశ్చవర్జయేత్. ౧౭

టీక॥ భూతృణం=చిప్పరగడ్డిని , సురసం = నగ్గెరఆకును , శిగ్రుం=మునగకాయను, పాలఘ్నం=కుక్కగొడుగును , సింధుకం= వావిరిఆకును తథా=అటువలెనే, కూశ్మాండాలాబువార్తాకకోవిదారాశ్చ=గుమ్మడికాయను పొరకాయను వంకాయను దేవకాంచనమును, వర్జయేత్ = వి

డిపించవలయును.

పిప్పలీంమరిచంచైవ తథావై పిండమూలకం ।
కృతంచలవణంసర్వం వంశాగ్రంతువివర్జయేత్. ౧౮

టీక॥ పిప్పలీం=పిప్పళ్లను, మరిచంచఏవ=మిర్యాలను, తథావై=అటువలెనే, పిండమూలకం=గాజరగడ్డను, సర్వం=అన్ని, కృతంచలవణం=మనుష్యులచేతచేయబడినఉప్పును, వంశాగ్రంతు= వెదురుమొలకను, వివర్జయేత్=విడిపించవలయును

రాజమాషాన్మసూరాంశ్చ కోద్రవాన్కోరదూషకాన్
లోహితాన్వృక్షనిర్యాసాన్ శ్రాద్ధకర్మణివర్జయేత్. ౧౯

టీక॥ రాజమాషాన్=అలచందలను, మసూరాంశ్చ=చిరుసెనగలను, కోద్రవాన్=ఆర్లను, కోరదూషకాన్=కొర్రలను, లోహితాన్=ఎర్రటి, వృక్షనిర్యాసాన్=చెట్టుబంకలను, శ్రాద్ధకర్మణి=శ్రాద్ధకర్మయందు, వర్జయేత్=విడిపించవలయును.

ఆమ్రమామలకీమిక్షుం మృద్వీకాదధిదాడిమాన్ ।
విదార్యశ్చైవరంభాద్యా దద్యాచ్ఛ్రాద్ధేప్రయత్నతః.

టీ॥ ఆమ్రం=మామిడి (పండును,) ఆమలకీం = ఉశిరిగె(కాయను,) ఇక్షుం = చెరుకును, మృద్వీకాదధిదాడిమాన్ = ద్రాక్షను పెరుగును దాడిమ(పండు)ను, విదార్యశ్చఏవ = నేలగుమ్ముడుపండ్లను, రంభాద్యాః=అరిటిమొదలైనపండ్లను, శ్రాద్ధే=శ్రాద్ధమునందు, ప్రయత్నతః=యత్నముతోటి, దద్యాత్=ఇయ్యవలయును.

ధానాలాజామధుయుతాః సక్తూన్శర్కరయాతథా ।
దద్యాచ్ఛ్రాద్ధేప్రయత్నేన శృంగాటకవిసైకతాన్. ౨౦

టీక॥ మధుయుతాః=తేనెతోచేరిన, ధానాలాజాః = వేపుడుబియ్యమును పేలాలను, తథా=అటువలెనే; శర్కరయా=చక్కెరతోచేరిన, స

క్షూన్ = పేలపిండిని, శృంగాటకవిసైకతాన్ = పరికెగడ్డనువిశేషముగాఇ సుకలోపుట్టేద్రవ్యమును, శ్రాద్ధే = శ్రాద్ధమందు, ప్రయత్నతః = యత్నము తోట్కిదద్యాత్ = ఇయ్యవలయును.

భోజయిత్వాద్విజాన్భక్త్యాస్వాచాన్తాన్దత్తదక్షిణాన్ ।
అభివాద్యపునర్విప్రా ననువ్రజ్యవిసర్జయేత్. ౨౧

టీక॥ ద్విజాన్ = బ్రాహ్మణులను, భక్త్యా = భక్తిచేత, భోజయిత్వా = భుజింపచేసి, స్వాచాన్తాన్ = ఆచమనముచేసినవారైన, దత్తదక్షిణాన్ = ఇవ్వబడినదక్షిణగలవారైన, విప్రాన్ = బ్రాహ్మణులను, పునః = తిరిగి, అభివాద్య = నమస్కరించి, అనువ్రజ్య = కొంతదూరముసాగించి, విసర్జయేత్ = విడిపించవలయును.

నిమంత్రితస్తుయశ్శ్రాద్ధేమైధునంసేవతేద్విజః ।
శ్రాద్ధందత్వాచభుక్త్వాచయుక్తస్స్యాన్మహతైనసా. ౨౨

టీక॥ యఃతు = ఏ, ద్విజః = బ్రాహ్మణుడు, శ్రాద్ధే = శ్రాద్ధమందు, నిమంత్రితః = బ్రాహ్మణార్థమునకుగానునియమింపబడి, శ్రాద్ధం = (లేక) శ్రాద్ధమును, దత్వాచ = ఇచ్చి (పెట్టి) భుక్త్వాచ = (లేక)(బ్రాహ్మణుడుగా)భుజించి, మైధునం = మైథునమును, సేవతే = చేయుచున్నాడో, మహతా = (వాడు)విశేషమైన, ఏనసా = పాపముతో, యుక్తః = గూడినవాడు, స్యాత్ = అగుచున్నాడు. *

కాలశాకంమహాశల్కం మాంసంవార్ధ్రీణసస్యచ ।
ఖడ్గమాంసంతథానంతం యమఃప్రోవాచధర్మవిత్. ౨౩

టీక॥ కాలశాకం = కరివేపాకును, మహాశల్కంచ = మహాశల్కమనేమత్స్యమును, వార్ధ్రీణసస్యచ = ముసలితెల్లమేకయొక్క, మాంసం = మాంసమును, తథా = అటువలెనే, ఖడ్గమాంసంచ = ఖడ్గమృగమాంసమును, అనంతం = అక్షయఫలదముగా, ధర్మవిత్ = ధర్మముతెలిసిన; యమః = యముడు, ప్రోవాచ = పలికెను. *

ఇతిశ్రీశంఖస్మృతౌ * చతుర్దశోధ్యాయః

శ్రీశంఖస్మృతౌ=శంఖస్మృతియందు

చతుర్దశోధ్యాయః= పదునాలుగవఅధ్యాయము

ఇతి=ముగిసెను.







శ్రీరస్తు.



అథశంఖస్మృతౌ

పంచదశాధ్యాయ ప్రారంభః.

యద్దదాతిగయాక్షేత్రే ప్రభాసేపుష్కరేతథా ।
ప్రయాగేనైమిశారణ్యే సర్వమానంత్యమశ్నుతే. ౧

టీక॥ గయాక్షేత్రే=గయాక్షేత్రమందు, ప్రభాసే= సోమతీర్థమందు, తథా=అటువలెనె, పుష్కరే=పుష్కరశిరస్సుయందు, ప్రయాగే = ప్రియాగక్షేత్రమందు, నైమిశారణ్యే=నైమిశారణ్యామందు; యత్=దేనిని, దదాతి=ఇచ్చుచున్నాడో, సర్వం=(అది)యావత్తు, ఆనంత్యం=అక్షయత్వమును, అశ్నుతే=పొందుచున్నది.

గంగాయమునయోస్తీరే అయోధ్యామరకంటకే ।
నర్మదాయాంనదీతీరే సర్వమానంత్యమశ్నుతే. ౨

టీక॥ గంగాయమునయోః= గంగాయమునలయొక్క, తీరే=గట్టునందు ను,అయోధ్యామరకంటకే=అయోధ్యామరకంటకమందును,నర్మదాయాన దీతీరే=నర్మదానదీతీరమందు, (దేనినిచ్చుచున్నాడో) సర్వం=(అది) యావత్తును, ఆనంత్యం=అక్షయత్వమును, అశ్నుతే=పొందుచున్నది.

వారణాస్యాంకురుక్షేత్రే భృగుతుంగేమహాలయే ।
సప్తారణ్యేసికూపేచ దత్త మక్షయముచ్యతే, 3

టీక॥ వారణాస్యాం=కాశియందు; కురుక్షేత్రే = కురుక్షేత్రమునందు; భృగుతుంగే=భృగుతుంగక్షేత్రమునందు, మహాలయే=మహాలయక్షేత్రము దందు,సప్తారణ్యే=సప్తారణ్యక్షేత్రమునందు,అసికూపేచ=అసికూపతీర్థ మునందు, దత్తం=ఇయ్యబడినది, అక్షయం=అక్షయముగాః ఉచ్యతే=చెప్పబడుచున్నది.

మ్లేచ్ఛదేశే తథా రాత్రౌ సంధ్యాయాంచ విశేషతః।
న శ్రాద్ధమాచరేత్ప్రాజ్ఞో మ్లేచ్ఛదేశే నచవ్రజేత్. ౪

టీక॥ మ్లేచ్ఛదేశే=మ్లేచ్ఛదేశమందు , రాత్రౌ = రాత్రికాలమందు, తథా=అటువలెనే , సంధ్యాయాంచ=సంధ్యాకాలమునందు , విశేషతః= ముఖ్యముగా, ప్రాజ్ఞః=తెలిసినవాఁడు, శ్రాద్ధం = శ్రాద్ధమును, నఆచరేత్ = చేయకూడదు , మ్లేచ్ఛదేశే = మ్లేచ్ఛదేశమందు , నచవ్రజేత్= పోకూడదు.

హస్తిచ్ఛాయాసు యద్దత్తం యద్దత్తంరాహుదర్శనే ।
విషువత్యయనే చైవ సర్వమానంత్య మశ్నుతే. ౫

టీక॥ హస్తిచ్ఛాయాసు =గజచ్ఛాయఅనేపుణ్యతిథులయందు, యత్ దత్తం=ఏదిఇయ్యబడినదో, రాహుదర్శనే=గ్రహణకాలమందు,విషువతి= విషువత్తుఅనుసంక్రమణమందును , అయనేచఏవ=ఉత్తరదక్షిణాయనములందు, యత్ దత్తం=ఏదిఇయ్యబడినదో,సర్వం= (అది) అంతయును , ఆనంత్యం=అక్షయత్వమును, అశ్నుతే=పొందుచున్నది.

ప్రోష్ఠపద్యామతీతాయాంమఘాయుక్తాం త్రయోదశీమ్ ।

ప్రాప్య శ్రాద్ధం ప్రకర్తవ్యం మధునా పాయసేనచ. ౬

టీక॥ ప్రౌష్ఠపద్యాం=భాద్రపదపున్నమి, అతీతాయాం=పోగానే, మఘాయుక్తాం=మఘానక్షత్రయుక్తమగు, త్రయోదశీం=త్రయోదశితిథిని, ప్రాప్య=పొంది, శ్రాద్ధం=శ్రాద్ధము, మధునా=తేనెచేతను, పాయసేనచ=పాయసముచేతను, ప్రకర్తవ్యం=చేయతగ్గది.

ప్రజాం పుష్టిం యశస్స్వర్గమారోగ్యం చ ధనంతథా।
నృణాం శ్రాద్ధై స్సదాప్రీతాః ప్రయచ్ఛంతి పితామహాః, ౭

శ్రాద్ధైః=శ్రాద్ధములచేతను, ప్రీతాః=ప్రీతినొందిన, పితామహాః=పితృదేవతలు, నృణాం=(శ్రాద్ధముచేసె)మనుష్యులకు, ప్రజాం=సంతానమును, పుష్టిం=బలమును, యశః=కీర్తిని, స్వర్గం=స్వర్గమును, ఆరోగ్యంచ=ఆరోగ్యమును, తథా=అట్టువలెనె, ధనం=ధనమును, సదా=ఎల్లప్పుడు, ప్రయచ్ఛంతి=ఇచ్చుచున్నారు.

ఇతిశ్రీశంఖస్మృతౌచతుర్దశోధ్యాయః

శ్రీశంఖస్మృతౌ=శంఖస్మృతియందు

చతుర్దశోధ్యాయః= పదునాలవ యధ్యాయము

ఇతి=ముగిసెను.







శ్రీరస్తు.

అథశంఖస్మృతౌ.

పంచదశాధ్యాయప్రారంభః.

• జననే మరణేచైవ సపిండానాం ద్విజోత్తమః ।
త్ర్యహాచ్ఛుద్ధిమవాప్నోతి యోగ్నివేదసమన్వితః. ౧

టీ॥యః=ఏ, ద్విజోత్తమః=బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, అగ్నివేదసమన్వితః=అగ్నులతో వేదములతో జేరుకొనియున్నాఁడో, సపిండానాం=(వాఁడు) జ్ఞాతులయొక్క, జననే=పుట్టుటయందు, మరణేచఏవ=చావుయందు, త్ర్యహాత్ = మూఁడుదినములచేతను, శుద్ధిం = ఆశౌచనివృత్తిని, అవాప్నోతి= పొందుచున్నాఁడు.

సపిండతా తు పురుషే సప్తమేవినివర్తతే।
నామధారకవిప్రస్తు దశాహేనవిశుధ్యతి. ౨

టీ॥ నామధారకవిప్రఃతు = పేరుమాత్రముచేత బ్రాహ్మణుఁడైనవాఁడు, దశాహేన = పదిదినములచేత, విశుధ్యతి = శుద్ధినిపొందుచున్నాఁడు, సపిండతాతు = సపిండత్వము, సప్తమెపురుషె = ఏడవపురుషునియందు, వినివర్తతె = నిలిచిపోవుచున్నది.

క్షత్రియో ద్వాదశాహేన వైశ్యః పక్షేణ శుధ్యతి।
మాసేనతు తథాశూద్ర శ్శుద్ధిమాప్నోతి నాంతరా. ౩

టీక ॥ క్షత్రియః = క్షత్రియుఁడు, ద్వాదశాహేన = పండ్రెండుదినములచేత, వైశ్యః = వైశ్యుఁడు, పక్షేణ = పదునైదుదినములచేత, శుధ్యతి = శుద్ధినిపొందుచున్నాఁడు, శూద్రః = శూద్రుఁడు, తథా = అటువలెనె, మాసేనతు = నెలచేతను, శుద్ధిం = శుద్ధిని, ఆప్నోతి = పొందుచున్నాఁడు, అంతరా = విధించినకాలమునకులోపల,న = (శుద్ధిని) పొందఁడు.

రాత్రిభి ర్మాసతుల్యాభి ర్గర్భస్రావే విశుధ్యతి।
అజాతదంతబాలేతు సద్యశ్శౌచం విధీయతె. ౪

టీక॥ గర్భస్రావే=కడుపుదిగబడడమందు, మాసతుల్యాభిః = (దిగబడినగర్భ) మాసములతోసమానమైన, రాత్రిభిః=దినములచేత, విశుధ్యతి= (తండ్రి) శుద్ధినిపొందుచున్నాడు, అజాతదంతబాలేతు= పల్లురానిపిల్లకాయ (చనిపోయిన) విషయములో, సద్యఃశౌచం= (జ్ఞాతులకు) స్నానమాత్రముచేతశుద్ధి, విధీయతే=విధింపబడియున్నది.

అహోరాత్రేణ శుధ్యంతి బాలే త్వకృతచూడకే ।
తథైవానుపనీతేతు త్ర్యహాచ్ఛుధ్యంతి బాంధవాః. ౫
అనూఢానాంతు కన్యానాం తథైవ శూద్రజన్మనామ్।

టీక॥ అకృతచూడకే=జుట్టువిడిపించని, బాలేతు=పిల్లకాయ (చనిపోయిన) విషయములో, బాంధవాః=జ్ఞాతులు, అహోరాత్రేణ=ఒకదినముచేత, శుధ్యంతి=శుద్ధిఃపొందుచున్నారు, తథాఏవ=అటువలెనే, అనుపనీతేతు=ఉపనయనముగాక (చనిపోయిన) విషయములో, త్ర్యహాత్=మూడుదినములచేత,శుధ్యంతి = శుద్ధిఃపొందుచున్నారు, అనూఢానాం=వివాహముకాని, కన్యానాంతు=కన్యలకు, శూద్రజన్మనాం = వివాహితశూద్రస్త్రీయందుపుట్టినసంతతకిని, తథాఏవ= అటువలెనే (మూడుదినములచేతశుద్ధి.)

అనూఢభార్యశ్శూద్రస్తు షోడశాద్వత్సరాత్పరమ్।
మృత్యుంసమధిగచ్ఛేచ్చేన్మాసాత్తస్యాపిబాంధవాః ।
శుద్ధింసమధిగచ్ఛేయు ర్నాత్రకార్యావిచారణా. ౬

టీక॥ అనూఢభార్యః=వివాహముకాని, శూద్రఃతు=శూద్రుడు, షోడశాత్ వత్సరాత్, పరం=పదునారుసంవత్సరములకుపైని, మృత్యుం = మరణమును, సమధిగచ్ఛేత్-చేత్ =పొందినట్లైతే=తస్య=వానియొక్క, బాంధవాః-అపి=(వాని)జ్ఞాతులు, మాసాత్=ఒకనెలవలన, శుద్ధిం=శుద్ధిని, సమధిగచ్ఛేయుః=పొందుదురు, అత్ర=ఈవిషయమై, విచారణా=విచారము, నకార్యా=చేయవలసినదిలేదు.

పితృవేశ్మనియాకన్యా రజఃపశ్యత్య సంస్కృతా ।

